# ఆంధ్రప్రదేశ్

ఆగస్టు, 1957

సంపుటి 1 — సంచిక 10

శ్రావణము, శాలివాహనశకము - 1879





స్మారక చిహ్నానికి రాష్ట్ర గవర్నరు పుష్పగుచ్ఛం సమర్పిస్తున్నారు.



1957 ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవాన సికిందరాబాదులోని పెరేడ్ మైదానంలో
ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి సైనికవందనం స్వీకరించారు,



1857 స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వీరుల స్మారకార్థమై హైదరాబాదు నగరంలోని రెసిడెన్సీ వద్ద స్మారకచిహ్నం నిర్మింపబడింది. ఈ స్మారకచిహ్నాన్ని 1957 ఆగస్టు 17 వ తేదీన రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన్ సాచార్ అమరవీరులకు అంకితం చేశారు.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 | ఆగస్టు, 1957 | సంచిక 10
శ్రావణము, శాలివాహనశకము - 1879

## విషయ సూచిక



ముఖ చిత్రం :



హైద్రాబాదునగరంలోని మక్కామసీదు. నూరేళ్ళక్రితం బ్రిటిషు వారి పరిపాలనకు వ్యతిరేకంగా ఆరంభమైన స్వాతంత్ర్యోద్యమంలో ఈ మసీదు వహించినపాత్ర స్మరణీయమైనది. చరిత్రాత్మకమైన ఈ స్థలం లోనే 1857 జూలై 17 వ తేదీన వేలాది ప్రజలు గుమికూడి ఆరోజు సాయంత్రమే రెసిడెన్సీపై దాడిచేయవలెనని నిర్ణయించారు.

— చందా —

సాలుసరి రు. 1–8–0

లేక

ఒక రూపాయ 50 న.పై.

విడిప్రతి 0–2–0 లేక

12 నయా పైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే *ప్రచురింపబడి* అజంతా ప్రింటర్సులో *ముద్రింపబడినది.*

# "ధీరోదాత్తులైన ఉత్తమ పౌరులు ఈనాడు దేశాని కవసరం"

## రాష్ట్ర ప్రజలకు గవర్నరు ఉద్బోధ

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సాచార్ పదవీస్వీకరణానంతరం 1957 ఆగస్టు 1 వ తేదీ రాత్రి ఆలిండియా రేడియో హైదరాబాదు నిలయంనుంచి ప్రథమపర్యాయంగా రాష్ట్ర ప్రజలకు సందేశమిస్తూ ఇలా అన్నారు :

" ఉత్తరభారతంనుంచి వచ్చినవారికి ఆంధ్రప్రదేశ్‌లోని అనేక విషయాలు విచిత్రంగా కన్పిస్తాయి. కాని చరిత్రనూ, సాంఘికశాస్త్రాన్నీ అధ్యయనం చేసేవారికి ఉత్తరదక్షిణ భారతాలను సమైక్యంచేసే ఒకానొక విధమైన సాహూప్యత, ఐక్యతాభావం ఇక్కడ గోచరించకపోవు. ఉత్తర దక్షిణ భారతాలకు సంగమస్థానమని చెప్పదగింది, హిందూ మహమ్మదీయ సంస్కృతుల సమ్మేళనం ప్రతి అడుగునా నేత్రోత్సవంచేసే ప్రాంతమూ భారతదేశంలో ఏదైనా వుందంటే అది ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రమే అనాలి. ఇది మహత్తరమైన విషయం. ఇక్కడ కోట్లాది ప్రజల మాతృభాష తెలుగు అయినప్పటికీ ఉర్దూ, హిందూస్తానీ భాషలు కూడా సమంగా వర్ధిల్లుతున్నవి. "



ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావుగారు రాష్ట్రగవర్నర్‌గా నియమితులైన శ్రీ భీమసేన్ సాచార్‌గారిచేత ప్రమాణస్వీకారం చేయిస్తున్నారు.

## ఆర్థిక స్వాతంత్ర్యం

గవర్నరు తమప్రసంగంలో ఇంకా ఇలా అన్నారు: "దేశం సంపూర్ణస్వాతంత్ర్యం సాధించి, కుల మత వర్ణ వృత్తి స్త్రీ పురుష విచక్షణ లేకుండా వయోజను లందరికీ ఓటింగుహక్కు లభించి, ప్రజాస్వామికమూ ఆదర్శప్రాయమూ అయిన రాజ్యాంగం రూపొంది, అది అమలు జరుపబడుతూవున్న దశలో నేను ఆంధ్ర ప్రదేశ్ పరిపాలనా బాధ్యతను స్వీకరించాను. అయితే మన ఉద్యమం ఇంతటితో ఆగలేదు. ఇప్పుడు మన జాతీయోద్యమం రెండవదశలోకి అడుగు పెడుతున్నది. నేడు మన లక్ష్యం ఆర్థిక స్వాతంత్ర్యం. భారతదేశ ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించడానికై పంచవర్ష ప్రణాళిక రూపంలో బ్రహ్మాండమైన కార్యక్రమం తయారు చేయబడింది. దానికి కోట్లకొలది రూపాయలు ఖర్చు అవుతాయి. ఫలితంగా చిరకాలంనుంచి మనం కలలు గంటూ వచ్చిన సుభిక్షమైన, భాగ్యవంతమైన నవ భారతం అవతరిస్తుంది."

## ఉత్తమ పౌరులు

"....అయితే కేవలం ఆర్థికాభివృద్ధివల్లనే దేశం, జాతి సమగ్రంగా రూపొందవు. సేవాభావం, ప్రేమ, సానుభూతి, సోదరభావం, త్యాగం, సహనం, ఔదార్యం, క్రమశిక్షణగల ఉత్తమమైన పౌరులను తయారుచేయడంకూడా మన కర్తవ్యం. దేశక్షేమం కొరకై, మానవజాతి శ్రేయస్సుకొరకై మహత్తర మైన త్యాగం చెయ్యడానికి వెనుకంజవేయని సాహసో పేతులైన, ధీరోదాత్తులైన దేశభక్తులు నేనాడు అవసరం."





రాష్ట్ర గవర్నర్‌గా నియమితులైన శ్రీ భీమసేన్ సాచార్‌గారికి సికింద్రాబాదు రైలుస్టేషన్‌లో స్వాగతం : చిత్రంలో గవర్నర్ పదవినుండి విరమించుకొన్న శ్రీ త్రివేది, క్రొత్త గవర్నర్ శ్రీ భీమసేన్ సాచార్, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, సాచార్ సతీమణి వున్నారు.

# మన గమ్యం సామ్యవాదపద్ధతి సమాజం

★

ఈ సంవత్సరం మన దశమ స్వాతంత్ర్య వార్షికోత్సవంతో పాటుగా 1857 ప్రథమ భారతస్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవాలు కూడా జరుగుతున్నవి. మన స్వాతంత్ర్యపోరాట చరిత్రలో అది మహోజ్జ్వలమైన అధ్యాయం. ఆ సంవత్సరం తిరుగుబాటుదార్లు బహద్దుర్‌షాను తమ చక్రవర్తిగా ప్రకటించి బ్రిటిషు దళాలతో పోరుసల్పారు. ఈ పోరాటం ప్రధానంగా ఉత్తర భారతదేశంలో ఆరంభమైంది. ఆ వార్త దక్షిణ దేశంలో పొక్కడంతోనే విదేశీపరిపాలనపట్ల అసంతృప్తిచెందివున్న ప్రజలు, విదేశ పరిపాలకులూ, జమీందార్లూ ఏకమై ప్రతిఘటించినప్పటికీ కూడా సరకుచేయక తిరుగుబాటు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఇట్టి వీరోచితమైన తిరుగుబాట్లు జరిగాయి. మానసీయుడైన ఒక మౌల్వీ నాయకత్వం క్రింద రెసిడెన్సీపై జరిగిన దాడి, రోహిలాల తిరుగుబాటు, రంగారావు కుట్ర మొదలగు సంఘటనలు చరిత్ర ప్రసిద్ధమైనవి. ఎందరో వీరులు విదేశీయ దళాలతో పోరాడుతూ నేలకొరిగారు. మరి కొందరిని బ్రిటిషువారి సైన్యాలు పట్టుకొని ఫిరంగీలకు కట్టి పేల్చివేశాయి. కొందరిని తుపాకీలతో కాల్చిచంపారు. కొందరు ఉరితీయబడ్డారు. అనేక మందికి యావజ్జీవ కారాగారవాసశిక్ష విధింపబడింది.

స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్న ఆ అమరవీరుల సాహసకృత్యాలను స్మరిస్తూ ఈనాడు మనం వారికి జోహార్లు అర్పిస్తున్నాము. నూరేళ్ళ మన స్వాతంత్ర్యసమరంలో నిహతులైన దేశభక్తులందరికీ వారు మార్గదర్శకులు.

మన దాస్యబంధాలు తెగిపోయ్యాయి. ఇప్పుడు మనం స్వతంత్రప్రజలం. స్వాతంత్ర్యం, సిరిసంపదలు, శాంతి సుహృద్భావాలతో తులతూగే నవభారత నిర్మాణంలో ఇప్పుడు మనందరికీ ఆ అమరవీరుల త్యాగాలు ఉత్తేజం కలిగిస్తున్నవి. ఉమ్మడికుటుంబంలోనివారిమాదిరిగా ప్రతిరాష్ట్రం జాతీయ పునర్నిర్మాణ మహాకార్యంలో తమ విధ్యుక్తధర్మం నెరవేర్చాలి. భారతదేశంలోని పెద్ద రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఈనాడు మనం పారిశ్రామికంగా అంత అభివృద్ధి పొందివుండకపోవచ్చు. మన ఆర్థిక వ్యవస్థ ముఖ్యంగా వ్యవసాయికమైనదే కావచ్చు. కాని ప్రకృతి సంపదరీత్యా, మానవ బలగంరీత్యా మనం సుసంపన్నులం. సామ్యవాదపద్ధతి పథకరచనలో, నిర్వహణలో కృషిచేయడానికి ఎందరో ఉత్సాహవంతులు మనరాష్ట్రంలో వున్నారు. నా ఆంధ్రప్రజలను నేను బాగా ఎరుగుదును. వారు ఉత్సాహం, ఉద్యోగం, అప్రమత్తత గలవారు. వారిలో చాలామంది రైతులు. కండపుష్టికీ, కార్యదక్షతకూ పేరుపడ్డవారు. అట్టివారందరి సహాయసహకారాలతో చిరకాలంనుంచి మనం వాంఛిస్తూవచ్చిన సవ్యాంధ్ర అనే లక్ష్యాన్ని చేరుకోగలమని విశ్వసిస్తున్నాను.

జై హింద్.

15 ఆగస్టు 1957

(సం.) నీలం సంజీవరెడ్డి

ముఖ్యమంత్రి

# దక్షిణ భారతంలో 1857 స్వాతంత్ర్యసమరం

## హైదరాబాదు రెసిడెన్సీపై దాడి, తూర్పు గోదావరిలో తిరుగుబాటు

దేశంలో రాకపోకల సౌకర్యాలు, వార్తా సౌకర్యాలు సరిగాలేని కారణంచేత ఉత్తర భారతంలో ఆరంభమైన 1857 తిరుగుబాటు వార్త దక్షిణాదికి ఆలస్యంగా చేరింది. కాని వార్త అందినవెంటనే దాని ఫలితాలు వెంటనే కలుగ నారంభించాయి. అక్కడక్కడా చెదురువాటుగా తిరుగుబాట్లు జరిగాయి. ఈ పరిస్థితి రెండుదశాబ్దాలదాకా కొనసాగి, తుదకు ఖమ్మంమెట్టుజిల్లా సరిహద్దుల్లో రంపతిరుగుబాటు, భద్రాచలం తాలూకాలో రేకపల్లి తిరుగుబాటు, 1879 లో గుల్బర్గా జిల్లాలో వాసుదేవ బల్వంత ఫాడ్కే నాయకత్వాన జరిగిన తిరుగుబాటు — ఈ రూపాలలో పరిణమించింది.

1857 ఉద్యమం యొక్క ఈ వివరాలన్నీ హైద్రాబాదులో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచన కొరకై నియమింపబడ్డ హైద్రాబాదు రాష్ట్రి కమిటీవారి పరిశోధనల మూలంగా బైట పడ్డవి. ఈ దిగువ ఉదహరింపబడిన సంఘటనలన్నీ ఆకమిటీవారు ప్రచురించిన సంపుటంలో నుంచి సేకరింపబడ్డవి. 1858 లో టూర్పు గోదావరిలో ప్రారంభమైన ఉద్యమం వివరాలు మద్రాసు సివిల్ సర్వీసుకు చెందిన హెన్రీ మారిస్ అను నాతడు ప్రకటించిన "డిస్క్రిప్టివ్ అండ్ హిస్టారికల్ అకౌంట్ ఆఫ్ ది గోదావరి డిస్ట్రిక్టు" అను గ్రంథంలో వర్ణింపబడినట్టివి. ఈ గ్రంథం 1878 లో ప్రచురింపబడింది.

హైదరాబాదు రాష్ట్రింలో 1800 లగాయతే బ్రిటిషు వ్యతిరేక భావాలు ప్రజలలో కలుగ జొచ్చాయి. ఆ సంవత్సరమే నిజాముకూ, ఈస్టిండియా కంపెనీవారికి మధ్య ఒక ఒడంబడిక జరిగింది. ఫ్రెంచివారి క్రింద శిక్షణపొందినట్టి దళాలలో మిగి లిన వారిని పునర్వ్యవస్థీకరించి రాజా మహీపతిరాం నాయకత్వాన వుంచడమైనది. ఆయన ప్రోత్సాహం మూలకంగా ఆ సైనికులలో బ్రిటిషు వ్యతిరేకభావం విపరీతంగా ప్రబలింది. బ్రిటిషువారికీ, వారి రక్షణ క్రింద వున్నట్టి ప్రధాన మంత్రి మీర్ ఆలంకూ వ్యతిరేకంగా రాజా మహీపతిరాం లేవదీసిన పోరాటాన్నిబట్టి హైద్రాబాదు రాష్ట్రి ప్రజలలో బ్రిటిషు వారిపట్ల ఎంత వ్యతిరేక భావం వుందీ తెలుస్తుంది. బ్రిటిషు రెసిడెంట్ రస్సెల్ నిజాం సైన్యంలోని కొంత భాగాన్ని బ్రిటిషు అధికారుల పర్యవేక్షణ క్రింద పునర్వ్యవస్థీకరించడానికి ఒక కారణం నిజాం సైనికులలోను, సైనికాధి కారులలోనుగల బ్రిటిషు వ్యతిరేక భావాన్ని పోగొట్టడానికే. ఆదళం సంఖ్య క్రమేణా హెచ్చడం, దానిపై సర్వాధికారాలు బ్రిటిషు రెసిడెంటు కలిగి వుండడం, ఆదళంలో సైనికులను చేర్చుకొనే పద్ధతి, దక్కన్ మనుష్యులను ఆసైన్యంలో చేర్చుకోక పోవడం ఇత్యాది విషయాలన్నీ రాష్ట్రి ప్రజలకు కంటకప్రాయ మయ్యాయి. భారత దేశంలో బ్రిటిషువారి స్థితి నానాటికి ఏవిధంగా వుంటూవున్నదీ హైద్రాబాదు ప్రజలు అతి శ్రద్ధగా గమనిస్తూ వచ్చారు. భారతదేశంలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చే రకరకాల మనుషులకూ ఇట్లగూ నగరం కేంద్రమై పోయింది. 19 వ శతాబ్ది ఆరంభంలో వందలాది అరబ్బులు నిజాం దగ్గర ఉద్యోగాలలో చేరారు. వారంతా అనతి కాలంలోనే శాంతియుతమైన రాష్ట్రి పరిపాలనా వ్యవస్థను భంగపుచ్చ గలిగినంత బలవంతులయ్యారు.

పశ్చిమోత్తర ప్రాంతంనుంచి సాహసులైన రోహిలాలు, ఆఫ్గనులు దక్కనుకు వలసరావడం మొదలైంది. రాజా చందూలాల్ ఆసరా చూచుకొని పంజాబునుంచి సిక్కులు రావడం మొదలుపెట్టారు. ఈ విధంగా హైద్రాబాదుకూ, భారతదేశంలోని ఇతర ప్రాంతాలకూ ఎప్పటికప్పుడు సంబంధాలు వుంటూ వొచ్చాయి. ఈ విధంగా రాష్ట్రంలో బ్రిటిషు వ్యతిరేక భావం బాగా వ్రేళ్ళు తన్నుకొన్నది. ఇట్టి బ్రిటిషు వ్యతిరేక చర్యలలో 1839 లో జరిగిన వహాబీ కుట్ర ఒకటి. ఈకాలంలోనే ఉత్తర భారతంనుంచి మతాధిపతులు హైద్రాబాదు వచ్చి, దక్కను ప్రాంతమంతటా వ్యాపించి వుండి, ఇంగ్లీషువారిపై జెహాద్ (మతయుద్ధం) ప్రేరేపించారు. కాని ఈ కుట్రను ముందుగానే తెలుసుకొని నాసిరుద్దౌలా తమ్ముడగు ముబారిజుద్దౌలానూ, అతని అనుచరులు 40 మందినీ అంగ్లేయులు పట్టుకున్నారు. వహాబీలతో సంబంధంవున్న కర్నూలు నవాబుపై దాడిజరిపి కొద్ది పోరాటం పిమ్మట ఆయనను అరెస్టుచేసి, ఆయన సంస్థానాన్ని స్వాధీనపరచుకున్నారు. ముబారిజుద్దౌలా చర్యలను విచారణచేయడానికై ఒక కమీషన్ నియమింపబడింది. ఆ విచారణ సందర్భంలో ఆ కుట్ర ఎంత దృఢంగా పన్నబడిందీ విదితమైంది. హైద్రాబాదు సబ్సిడియరీ, కంటింజెంట్ దళాలలో అవిధేయతను పురికొల్పడానికై ప్రయత్నాలు చేయబడినట్లుగా కూడా తెలియవచ్చింది. ముబారిజుద్దౌలాను గోలకొండ కోటలో నిర్బంధించారు. అతడు 1854 లో మరణించేటంతవరకూ అందులోనే వున్నాడు. ఆయన అనుచరులు పది మందికి దీర్ఘకాల కారాగారశిక్ష విధింపబడింది. వారు 1857 కు కొద్ది సంవత్సరాలకు క్రితమే విడుదల చేయబడ్డారు. ఈ విధంగా 19 వ శతాబ్ది మధ్యభాగంవరకూ బ్రిటిషు వారిపై రాష్ట్ర ప్రజలలో గల వ్యతిరేకత అలాగే తగ్గుముఖం పట్టకుండా వుండిపోయింది.

## అందరిచూపులూ ఢిల్లీమీదనే

నిజాం నాసిరుద్దౌలా మరణానికి ఒక వారం ముందు 1857 స్వాతంత్ర్య సంగ్రామంతాలూకు మొదటి తిరుగుబాటు 1857 మే 10 వ తేదీన మీరట్‌లో జరిగింది. భారతీయ సిపాయీలు బ్రిటిషు సైనికాధికార్లపై తిరుగుబాటుచేసి, ఢిల్లీ బయలుదేరివెళ్ళి ఢిల్లీ పట్టణాన్ని ఆక్రమించుకొని బహద్దుర్ షాను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించారు. ఈ వార్త హైదరాబాదు చేరడంతోటే రాష్ట్రంలో పరిస్థితి విషమించింది. ఆనాటి పరిస్థితిని సమీక్షిస్తూ కర్నల్ డేవిడ్సన్ 1858-59 సంవత్సరపు పరిపాలనా నివేదికలో ఇలా వ్రాశాడు :

"అందరిచూపులూ ఢిల్లీ, లక్నోలమీదనే వున్నవి. ఏ వార్తవస్తుందా అని ప్రజలు వేయి కళ్ళతో ఎదురుచూచేవారు. వార్తలకోసం డబ్బుకూడా ఖర్చుపెట్టేవారు. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక పుకార్లు బైలుదేరాయి. యుద్ధప్రియులకూ ఈతిక్కవిపరీతంగా వున్న వారికీ అపుకార్లంటే బలే మోజుగా వుండేది. ఔరంగాబాదు, భోపాలు, అహమదాబాదు, బెల్గాం, కర్నూలు, మైసూరులనుంచి వొచ్చే రాజద్రోహకరమైన ఉత్తరాలను చింపిచూచి సంగతులు తెలుసుకోవడం జరిగేది. ఇక్కడే గనుక మంచి పలుకుబడిగల ప్రజానాయకుడు ఉద్భవించినట్లయితే రాష్ట్రం అతిత్వరగా పెద్ద పెట్టున తిరుగుబాటు సల్పివుండేది. అసలు అంతకుముందే రాజద్రోహకరమైన ఘటనలు అనేకం జరిగాయి. కాని అదృష్టవశాత్తు 1857 జులైలో రెసిడెన్సీపై జరిగినదాడి విఫలమైన తరువాత ఈ రాష్ట్రంలో ఉన్నతస్థితి, సంపద, పలుకుబడిగల నాయకుడెవరూ లేకపొయ్యాడు, 1857 జులై నెల హైద్రాబాదులో కల్లోలానికి అంతిమ ఘట్టంగా వుండిపోయింది."

## రెసిడెన్సీబలాల సమీకరణ

1857 జూన్ 12 వ తేదీన బ్రిటిషు రెసిడెంటు భారత ప్రభుత్వ విదేశాంగ శాఖకు ఈ విధంగా వ్రాశాడు :

"గడచిన కొన్ని రోజులనుంచి హైద్రాబాదు నగరంలో పరిస్థితి విషమిస్తూ వుంది. పశ్చిమోత్తర భారతంలో జరిగిన తిరుగుబాటు వివరాలు నగరంలోని ప్రముఖ వ్యక్తులకు చేరాయి. అనేకమంది రాజద్రోహం పురికొల్పుతున్నందువల్లనూ, వారిలో ఒక వ్యక్తి గతరాత్రి పట్టుపడడం వల్లనూ రెసిడెన్సీ ఎస్కార్టు దళాన్ని ఆరు తుపాకీలతోను, ఒక

ఆశ్వీక దళంతోనూ బలపరచడానికి నేను నిర్ణయించాను."

## తిరుగుబాటుకు తయారీ

హైదరాబాదు రాష్ట్రంలో 1857 జూన్ నెలలో పరిస్థితి ఎలావున్నదీ వార్తా పత్రికలు ఈ విధంగా వ్యాఖ్యానం చేశాయి :

1857 జూన్ 27 తేదీనాటి "ఇంగ్లీషుమన్" అను పత్రికలో 14 వ తేదీతో హైద్రాబాదునుంచి ఈ క్రింది వార్త ప్రచురింపబడింది :

"ఇక్కడ తిరుగుబాటు లక్షణాలు కన్పిస్తున్నవి. అయితే అవి అంత ప్రమాదకరమైనవి కావు. అయినా జాగ్రత్తపడడం అవసరం. సబ్సిడియరీ సైనిక దళానికి చెందిన స్థానికసైన్యంలో అవిధేయత ప్రబలిందనీ, తాము చేసే తిరుగుబాటులో పాల్గొనవలసిందిగా వారు నగరప్రజలను కోరినారనీ చెప్పుకుంటున్నారు. ఇందులో కొంత నిజం లేకపోలేదని అధికారులు భావించారని చెప్పడానికి సబ్సిడియరీ దళాలు నగరంలోకి ప్రవేశించకుండా నిజాం ప్రభుత్వం నగర ద్వారాలవద్ద అరబ్బులను నియమించవలసి రావడమే నిదర్శనం. నగరప్రజలు తిరుగుబాటు చేయడానికి ఉత్సహించారని చెప్పడానికి నగరంలో పలుతావులలో బ్రిటిషువారు ముస్లిములకు చేసిన అన్యాయాలనూ అపరాధాలనూ తెలిపే అట్టలనూ, మతాన్ని సంరక్షించుకోవలసిందిగా ముస్లిములను ప్రబోధిస్తున్నట్టి అట్టలనూ ప్రదర్శించడమే తార్కాణం. నిన్న పెద్దమసీదులలో ఈ విషయం దృఢపడింది. ఆ మసీదులలో అనేకమంది, ముఖ్యంగా సామాన్యజనం గుమికూడారు. మౌల్వీ అక్బర్ అనే మతప్రచారకుడు బోధ జరుపుతూవుండగా మద్రాసునుంచి వచ్చినారని చెప్పబడే ఇద్దరువ్యక్తులు ఆయన మాటల కడ్డుపడి "ఆడదానిలాగా ఎందుకు మాట్లాడుతావు. పవిత్రమైన మతయుద్ధం జరపమని కచ్చితంగా ఎందుకు చెప్పవు" అని ప్రశ్నించారు. అక్కడేవున్న నగరకొత్వాలు వారిని పట్టుకున్నాడు. కాని ఖామూష్‌షా అని చెప్పబడే పెద్ద మతగురువు యొక్క శిష్యులు వానిని విడుదల చేయించారు. ఈ ఖామూష్‌షా అనివార్యమైతే తప్ప లేకపోతే ఎవరితోనూ మాట్లాడడట. ఆ ఇద్దరువ్యక్తుల విడుదలలో ఈయనకు ప్రముఖపాత్ర గలదని కొందరంటున్నారు. ఈ ఖామూష్‌షా పవిత్రమైన వ్యక్తిగా భావింప బడుతున్నాడు. ఈయనకు పెద్ద అనుచర వర్గం వుంది. మసీదులో గుమికూడిన జనం 'దీన్' 'దీన్' అని కేకలు వేశారు. కాని పెద్దమనుషులెవరూ అందులో పాల్గొనలేదు. కొత్వాలు, మత ప్రచారకుడు మసీదునుంచి బైటపడ్డందుకు బ్రతుకు జీవుడా అని సంతోషించారు."

ఉత్తర బెరారు డిప్యూటీ కమాండరు టి. హెచ్. బులక్ తన పై అధికారికి జూన్ 29వ తేదీన ఇలా వ్రాశాడు:

"కనీసం 20,000 మంది సాయుధప్రజలు, ముఖ్యంగా ముస్లింలు ఉత్తర బెరారులో దౌర్జన్యానికి సిద్ధంగా వున్నారు. వారు అత్యాచారాలు చేస్తున్నట్లు నాకు వార్తలేమీ రాలేదు. వారు ఆయుధాలను పోగుచేసుకుంటూ అనుకూలమైన వార్తలేమైనా వొస్తాయా అని ఎదురు చూస్తున్నారు. కాబట్టి ఇవాళ అంతా నిశ్శబ్దంగావున్నా రేపు పెద్ద తిరుగుబాటు జరగవచ్చు."

## రెసిడెన్సీపై దాడి

హెచ్. జి. బ్రిగ్స్ అనునాతడు "నిజాం" అనే పేరుతో ఒక గ్రంథం వ్రాశాడు. అందులో జూలై 17వ తేదీన రెసిడెన్సీపై తిరుగుబాటుదార్లు జరిపిన దాడినిగూర్చి ఇలా అన్నాడు :

"సాయంత్రం ఆరుకావడానికి ఇంకా పావుగంట తక్కువ వుండగా సాలార్జంగ్ కర్నల్ డేవిడ్సన్ దగ్గరికి ఒక వార్తాహరుణ్ణి పంపి నగరంలో 500 మంది రోహిలాలు మౌల్వీ అల్లావుద్దీన్, రోహిలా నాయకుడు తుర్రేబాజ్‌ఖాన్‌ల నాయకత్వంక్రింద చెలరేగారనీ, వారివెంట పెద్ద జనసమూహం వుందనీ తెలియబరుస్తూ నిజాంసేనలను సమీకరించి పంపేదాకా రెసిడెంటు తన రక్షణవిషయం తానే చూచుకోవాలనీ కబురంపాడు. తిరుగుబాటుదార్లు వెంటనే నగరంపై పడ్డారు. పడమటివైపు రహదారిలో, సికింద్రాబాదు వైపుకు వెళ్ళేదారిలో ఇసుకవేసినా రాలకుండా జనం నిలిచారు. వాళ్ళను చూస్తే ఉద్రిక్తులైనట్లుగా కన్పించారు. రెసిడెన్సీ గేట్లన్నీ మూసివేయబడ్డవి. ఎక్కడ కాస్త సందు

వున్నా బయొనెట్లు పెట్టారు. రెసిడెంటు వెంటనే సంసిద్ధుడయ్యాడు. తనకు విశ్వాసంలేని వ్యక్తులు తనరక్షణకు రావడం ఏమిటని మండిపడ్డాడు. రోహిలాలు రెసిడెన్సీకి పడమటివైపు గోడకు ఎదురుగా వున్న ఉబ్బాసాహెబ్, జై గోపాలదాస్ అనే ఇద్దరు షాహుకార్ల రెండంతస్తుల భవనాలను ఆక్రమించుకోబోయ్యారు. ఇట్లా రెసిడెన్సీ మైదానములోకి వెళ్ళవచ్చుననుకున్నారు. తిరుగుబాటుదార్లు దిల్కుశ్ ఉద్యానవనాన్ని కూడా ఆక్రమించు కున్నారు. పుత్లీబావులీ గేటునుంచి కూడా దాడిచేయాలనుకొని గేటుదగ్గర కొక్కాలను లాగి ఏరవేశారు. అయితే పైనచెప్పబడిన షాహుకార్ల భవనాలమీదినుంచి దాడి చేయడమే వారి ముఖ్య లక్ష్యం. అక్కడినుంచి వెంటనే కాల్పులు ప్రారంభించారు. ఇరవై నిమిషాలు కాల్చారు. అప్పుడు కెప్టెన్ పరోప్కుస్ కాల్పులు ప్రారంభించాడు. తమ సైన్యంలో వాళ్ళు తిరుగబడకుండా యూరోపియను ఆఫీసర్లు అప్రమత్తులై మెలిగారు. తిరుగుబాటుదార్లు రాత్రి అంతా కాల్పులు జరిపారు. చివరకు తెల్లవారుజామున నాలుగు గంటలకు వారు ఆ ఇళ్ళను ఖాళీచేసి పోవాలనుకుంటూ వుండగా వారు నగరంపై పడకుండా నిరోధించడానికి మంత్రి అరబ్బులను అక్కడికి పంపాడు. వారి సహకారంతో తిరుగుబాటుదార్లు నగరంలోని తమ స్థావరాలకు వెళ్ళిపొయ్యారు. మద్రాసు హార్సు, ఆర్టిలరీ తుపాకీల కాల్పులవల్ల 32మంది చనిపోవడమో గాయపడడమో జరిగింది. రెసిడెన్సీపై ఈ గందరగోళం రాత్రిఅంతా జరిగి తెల్లవారి జూలై 18వ తేదీకల్లా తిరుగుబాటుదార్లు చెదిరిపొయ్యారు."

## అమరవీరులు

నగర శివార్లలో తుర్రేబాజ్ ఖాన్ బాగా గాయపడినస్థితిలో పట్టుబడ్డాడు. ఈ రోహిలా నాయకుడు తాను దాడిలో పాల్గొన్నట్లు ఒప్పుకున్నాడు. ఎవరి ఉత్తర్వులనుబట్టి పాల్గొన్నావని అడిగితే "నాకై నేనే పాల్గొన్నాను" అన్నాడు. మౌల్వీ అల్లావుద్దీన్ కూడా ఒక గ్రామంలో పట్టుబడ్డాడు. వీ రిద్దరినీ విచారణచేసి యావజ్జీవ శిక్ష విధించారు. వారి ఆస్తులు జప్తుచేయబడ్డవి. తుర్రేబాజ్ ఖాన్ జైలునుంచి పారిపొయ్యాడు. ఆయన్ని పట్టుకున్నవారికి 5 వేల రూ॥ల బహుమానం ఇస్తామని ప్రకటించారు. అతడు ఒకచోట దాగుకొని వుండగా ఒక సైనికదళం చూచింది. తుర్రేబాజ్ ఖాన్, అతని సహచరులు ఒగలలోనుంచి కత్తులులాగి సైనికదళంపై పడ్డారు. దళంవారు కాల్పులు జరుపగా ఖాను, అతని సహచరు డొకడు నేలగూలారు. మరి ముగ్గురు అనుచరులు ప్రక్కనేవున్న అడవిలోకి పారిపొయ్యారు. తుర్రేబాజ్ ఖాన్ శవాన్ని హైద్రాబాదు తీసుకువచ్చి ఒక బహిరంగస్థలంలో వ్రేలాడగట్టారు. మౌల్వీని అండమాను పంపారు. అతడు 1884లో మరణించేదాకా అక్కడే వున్నాడు.

ఈ ప్రాంతంలో జరిగినసంఘటనల్లో రెసిడెన్సీపై దాడి అతి ప్రధానమైనది. ఆ తరువాత ప్రజలలో ఇంకనూ అసంతృప్తి వుండడంచేత అక్కడక్కడా చెదురువాటుగా కొన్ని సంఘటనలు జరిగాయి. బ్రిటిషువారిపై ద్వేషభావం ప్రబలింది. చిన్న సంఘటనకూడా పెద్ద కొట్లాటకు దారితీసేది. తూర్పు గోదావరి జిల్లాలో ఒక చిన్న సాంఘిక సంఘటన సైనిక దళంతో సంఘర్షణవరకూ దారితీసింది.

## తూర్పుగోదావరి తిరుగుబాటు

మద్రాసు సివిల్ సర్వీసుకు చెందిన హెన్రీ మారిస్ ఈ సంఘటననుగురించి ఇలా వ్రాశాడు:

"కాలమునకు పరిస్థితి బాగాలేకపోవడంచేత ధరలు పెరగడంచేత ఈ సంవత్సరం పరిస్థితి చెడిపోయింది. ఉత్తర భారతంలో సిపాయిల తిరుగుబాటు జరిగిన కారణంచేత దక్షిణాది అంతా గోల బైలుదేరింది. ముఖ్యంగా ఈ జిల్లాలో అలజడి ఎక్కువగా వుంది. అసలు అప్పుడు భారతదేశంలో ఏ ప్రాంతమూ శాంతియుతంగా లేదు. ఆ సంవత్సరం మొహరం ఆగస్టునెలలో వచ్చింది. ఆసందర్భంలో ఏదో కొద్దిగా గొడవ జరిగింది. పశ్చిమోత్తర రాష్ట్రాలలో సంఘర్షణ ఎటూ తేలలేదు. ఢిల్లీని ఇంకా పట్టుకోలేదు. లక్నోకు విముక్తి లభించలేదు. దేశసంచారం చేసే సన్యాసులు, బిచ్చగాళ్లు రాజద్రోహం పురికొల్పుతూ వుండేవారు. కాని ప్రజలు, ముఖ్యంగా హిందువులు ప్రశాంతంగా, ప్రభుత్వానికి విధేయులై వున్నారు.

## ఆంగ్ల వ్యతిరేక భావం

అప్పుడు ఎర్రగూడెం, తాడిమళ్ళ తాలూకాలు వుండేవి. ఆ తాలూకాలకు ఉత్తరాన కొండలలో ఏదో చిన్న సంఘటన జరిగింది. కొందరు కొండరెడ్ల మధ్య చిన్న తగాదా దానికి మూలం. కాని అది ఉత్తరభారతం నుంచి వొచ్చిన వార్తలవల్లనే ప్రజ్వ రిల్లిందని అందులో ఒక వ్యక్తి వాఙ్మూల మిచ్చాడు. అతనిని నేనే విచారణ చేయవలసి వచ్చింది. ఆ వ్యక్తి చేతులుకట్టుకొని నిల్చొని ఇలా చెప్పాడు: "నాకు మాట్లాడే అనుమతి ఇస్తారా? నానాసాహెబ్ పెద్ద సైన్యంతో దేశమంతా గెలుచుకుంటూ వస్తున్నాడని తెలిసింది. ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా ఎవరు ఎక్కువ తిరగబడితే వారికి ఎక్కువ బహు మానం ఇస్తారని తెలిసింది."

గోదావరి జిల్లాలోని కొరటూరు గ్రామ పెద్ద కోరుకొండ సుబ్బారెడ్డి. అయన తన కుమారునికి బాగా డబ్బున్న ఒకానొక వితంతువును చేసుకోవా లనుకున్నాడు. కాని ఆవితంతువు బుట్టాయగూడెం మునసబు సుంకరస్వామికి ఉంపుడుకత్తె అయిందని తెలియగానే తన మనుషుల్ని తీసుకొనివెళ్ళి అవిడను అతని చెరనుంచి తప్పించడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో విఫలుడై అగ్రామాన్ని దోచుకొని ఆ సంపదతో పశువులతో ఆ వితంతువు మొదటిభర్త తాలూకు గ్రామం వెళ్ళాడు. అక్కడ మరికొందరు రెడ్లు ఆయనతో మిలాఖత్ అయ్యారు.

ఈసంగతి తెలుసుకొని ఆక్టింగ్ హెడ్ అసి స్టెంట్ మేజిస్ట్రేటు రాజమండ్రినుంచి అక్కడికి వెళ్ళాడు. ఆయన వెంట అరవై డెబ్భమంది బంట్రో తులు, తాలూకా తహశీల్దారు కూడా వెళ్ళి కోరుకొండ సుబ్బారెడ్డి దోచుకొన్న గ్రామంలో మకాం వేశారు. దుండగులున్న స్థలానికి వెళ్ళి కొందరిని అరెస్టుచేసి బుట్టాయగూడెం తీసుకొని వచ్చి అక్కడ రాత్రికి మకాం వేశారు. కాని తెల్ల వారు జామున్నే సుబ్బారెడ్డి, అయన కుమారుడి నాయకత్వాన కొండజాతులవారు హెచ్చుసంఖ్యలో విల్లంబులు మొదలగు ఆయుధాలతో వచ్చి మెజి స్ట్రేటును చుట్టవేశారు. బంట్రోతులు వారిని ఎదు ర్కొనలేక పోయారు. అరెస్టు చేసినవారిని మెజ స్ట్రేటు వదిలిపెట్టక తప్పలేదు. స్వాధీన పరచుకొన్న ఆస్తికూడా తిరుగుబాటు దార్లకు ఇచ్చివేసి ఆయన ఉపసంహరించుకోవలసి వచ్చింది. తిరుగుబాటుదార్లు సుంకరస్వామిని పట్టుకొని కొండలలోకి తీసుకెళ్ళి చంపివేశారు.

## నాగవరం కోట

ఈ సంఘటనలన్నీ నేరుగా కలెక్టరుకు నివేదించ బడ్డవి. అప్పుడు ధవళేశ్వరంనుంచి శాపర్స్, మైనర్సు దళాలు రెండు ఎర్నగూడెం పంపబడ్డవి. ఆక్టింగ్ జాయింటు మేజస్ట్రేటు వారితో కలిసి సివిల్ అధి కారాలను చేబట్టగా, కెప్టెన్ రోజ్ మిలిటరీ నాయ కత్వం వహించాడు. అన్ని ఏర్పాట్లు జరిగిన తరు వాత అంతా కలిసి కొండలమీదికి వెళ్ళారు. కొందరు తిరుగుబాటుదార్లు నాగవరంలో శిథిలమైవున్న కోటలో వున్నట్టు సమాచారం అందింది. కనుక వారు అక్కడనుంచి పారిపోకముందే అరెస్టుచెయ్యా లన్న ఉద్దేశంతో ఎర్నగూడెంనుంచివెంటనే అక్కడికి బైలుదేరారు. దళం వస్తున్న చప్పుడువిని తిరుగు బాటుదార్లు భూగర్భ మార్గాలగుండా పారి పొయ్యారు. రాత్రి పదిగంటలవేళ మిలిటరీ అక్క డికి చేరింది. చూస్తే కోటఅంతా నిర్మానుష్యంగా వుంది.

## కొండలలో పోరాటం

తిరుగుబాటుదార్లు జీలుగుమిల్లిలో నిలువదొక్కు కోవాలని ప్రయత్నించారు. ఈ గ్రామం ఒక కొండ వాగు ప్రక్కన ఎత్తుగా వున్న ప్రదేశంలో వుంది. గ్రామ ప్రజలు మచ్చు కట్టుకొని దానిపై పొంచి వుండి మిలిటరీవారు కొండ ఎక్కుతూవుంటే వారిపై కాల్పులు జరిపారు. ఆపిమ్మట ఆమచ్చు వదిలి గ్రామం వెనుకవున్న మైదానంలోకి పారి పొయ్యారు. ఆమైదానానికి రెండువైపులా అడవి వుంది, మూడవవైపున జొన్నచేనువుంది. సిపా యీలు అక్కడికి వెళ్ళారు. తిరుగుబాటుదార్లు వారిపై బాణాలు కొట్టి కాల్పులు జరిపి అడవిలోకి తప్పుకున్నారు. ఆతరువాత కొండలపై జరిగిన సంఘటన ఏదో బండవెనుకనుంచి, పొదచాటునుంచి చెదురువాటుగా కాల్పులు జరపడం తప్ప మరేమీ జరుగలేదు. కాల్పులు జరిపేమనిషి కన్పించేవాడు

కాదు. ప్రతీకారం జరుపకూడదనే భావంతోనే మెలి గారు. ఎప్పుడైనా ఒక సిపాయిని గాయపరచేవారు. హెచ్చరికకోసం దగ్గిరలోవున్న గ్రామం తగులబెట్ట బడింది. అసలా గ్రామాలలో ప్రజలే లేకుండా పొయ్యారు. కొంతమంది పట్టుబడ్డారు. ఈవిధంగా పదుంరోజుల పోరాటం తరువాత మిలిటరీ అక్కడనుంచి ఉపసంహరింప బడింది. కారణమేమంటే అది ఆరోగ్యకరమైన ప్రదేశంకాదు. సర్వీసుపై అక్కడికి వెళ్ళిన వారందరికీ అడవి జ్వరం తగులుకుంది. కొందరు ఆజ్వరంతో చనిపోయారు కూడా.

## ఉరి శిక్షలు

అయితే ఈ పోరాటం ఆగలేదు. కొంత రెవిన్యూ సిబ్బందిని కెప్టెన్ అల్లెన్ యఫ్. యఫ్. బ్లూంఫీల్డు నాయకత్వాన అక్కడికి పంపి తిరుగుబాటుదార్లపై చర్యలు గైకొనవలసిందని ఉత్తర్వు లివ్వబడ్డవి. సుబ్బారెడ్డి ఇంకా ఏడుగురు జట్టునాయకులు పట్టు బడ్డారు. సెషన్ జడ్జి 1857 సంవత్సరపు 14వ చట్టంక్రింద కమీషనర్‌గా వ్యవహరించి వారికి ఉరి శిక్ష విధించాడు. సుబ్బారెడ్డినీ, తిరుగుబాటుదార్లకు నాయకత్వం వహించి సుంకరస్వామి హత్యకూ ఇంకొక మనిషి హత్యకూ కారకుడైన కొర్ల శీతారామయ్యను వారు దురంతాలు చేసినచోటనే అనగా బుట్టాయగుడెంలో 1858 అక్టోబరు 7వ తేదీన ఉరితీయడమైనది. సీతారామయ్య సవతితల్లి కొడుకు కొర్ల వెంకటసుబ్బారెడ్డి, సుంకరస్వామి హత్యలో పాల్గొన్న గురుగుంట్ల కొమ్మిరెడ్డి అదేరోజు పోలవరంలో ఉరితీయబడ్డారు. సరిగ్గా అప్పుడే సుబ్బారెడ్డి తమ్ముడు కోరుకొండ తిమ్మారెడ్డి తూటిగుంటలో ఉరితీయబడ్డాడు. ఇతను తిరుగుబాటుదార్లతో చేరి సైనికదళానికి నాయకత్వం వహిస్తున్న ఆఫీసర్ క్యాంప్‌నుంచి వార్త గొనిపోతున్న ఒకమనిషిని స్వయంగా చంపాడు."

## ప్రజోద్యమం

ప్రజోద్యమం అనేక చోట్ల అనేక రూపాలలో కొనసాగింది. దాని వివరాలు ఇటీవలనే తెలిసినవి. స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనకై నియమింపబడ్డ హైదరాబాదు రాష్ట్రకమిటీ వ్యవహర్త శ్రీ పి. సేతు మాధవరావు వ్రాసిన విషయమిది. "1857 లో హైదరాబాదులో బ్రిటిషువారి పట్ల అవిధేయత ప్రబలింది. అనేక కుట్రలకు తిరుగుబాట్లకు ఉద్యమాలకు ఈ రాష్ట్రం స్థావరమైంది. హైదరాబాదు సబ్సిడియరీ కంటింజెంట్ సైన్యాలలో అవిధేయత, రెసిడెన్సీపై దాడి, షోరాపూరు రాజా తిరుగుబాటు, కొప్పల్ నివాసి భీమరావు ముదగ్గి తిరుగుబాటు అవన్నీ చరిత్ర చదివినవారికి తెలిసిన విషయాలే. కాని బీడ్ కుట్ర, రంగారావుపాగే యత్నాలు (ఈయన నానాసాహెబ్ పీష్వాదగ్గర నుంచి ఉత్తరాలు తేగలిగాడు. కాని కోలులలో తిరుగుబాటు లేవదీయబోగా ఇతనిని పట్టుకొని యావజ్జీవ కారాగారవాసశిక్ష విధించారు). 1862 లోనానాసాహెబ్ మేనల్లుడు రావుసాహెబ్ పీష్వా హైదరాబాదు రావడం, హైదరాబాదు నగరంలో 40 మంది ప్రముఖవ్యక్తులను విచారణచేసి శిక్ష విధించడం, 1867 లో భాల్కిలో రామారావు ఉరఫ్ జంగ్ బహదూర్ కుట్ర—అవన్నీ అందరికీ తెలియవు. నానాసాహెబ్ పీష్వా అనుయాయులమని చెప్పుకొని రోహిలాలు లేవదీసిన తిరుగుబాటు, ఆదిలాబాదుజిల్లా గోండులు రాంజీగోండ్ నాయకత్వాన చేసిన తిరుగుబాటు, ఇవికూడా చాలా మందికి తెలియవు. ఇవన్నీ ఈ సంపుటంలోనే ప్రకటితమైనవి. 1857 నుంచి 1859 వరకు తాంతియాతోపే అనుచరులకూ, హైదరాబాదులోని నాయకులకూ మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూ వుండేవి. ఈ సమరం మూలంగా హైదరాబాదులో కూడా అనేక కుటుంబాలు దమననీతికి గురిఅయినవి. ఔరంగాబాదులో తిరుగుబాటు చేయించిన నాయకులు ఉరి తీయబడ్డారు. 23 మందిని కాల్చి చంపారు. ముగ్గురిని ఫిరంగీలకుకట్టి పేల్చారు. రెసిడెన్సీపై జరిగిన దాడిలో 30 మంది నిహతులైనారు. భీమరావుదేశాయి వీరోచితమరణం పొందాడు. షోరాపూరురాజా వెంకటప్పనాయక్ ఆత్మహత్య చేసుకున్నాడు. తుర్రే బాజ్‌ఖాన్ మరణించాడు. అల్లావుద్దీను రంగారావులు యావజ్జీవ శిక్ష విధింపబడ్డారు. రాంజీగోండ్ ఉరితీయ బడ్డాడు. దీనినిబట్టి హైదరాబాదులో ఎంత జననష్టం జరి

(తరువాయి 19 వ పేజీలో)

# రాష్ట్ర పురోభివృద్ధికై ఎట్టి త్యాగం చేయవలసి వచ్చినా ప్రజలు సంసిద్ధులు కావాలి

## ముఖ్యమంత్రి స్వాతంత్ర్య దినోత్సవ సందేశం

"ఎంతటి అకుంఠిత దీక్షతో, మొక్కవోని ధైర్యవిశ్వాసాలతో స్వాతంత్ర్య సమరం సాగించామో, ఎంత పట్టుదలతో విశాలాంధ్ర రాష్ట్రంకోసం పాటుపడ్డామో, అదేవిధంగా రాష్ట్ర పురోభివృద్ధికై మనం పాటు పడవలసివున్నది. ఇది ప్రభుత్వమూ ప్రజలూ చేయి చేయీకలిపి నడువవలసిన మార్గం. ఇందులో ముఖ్యమంత్రికి ఎంత బాధ్యతవుందో సామాన్య కర్షకునికి కూడా అంతే బాధ్యత ఈ ఆదర్శ సాధనలో వున్నది. దీనికై ఆర్థికంగాగానీ, వ్యక్తిగతంగాగానీ మనం ఎట్టి త్యాగం చేయవలసి వచ్చినా సిద్ధంగావుండాలి. అప్పుడే మనం సూరేళ్ళ క్రిందట స్వాతంత్ర్య పతాకయెత్తిన ఆ వీరుల త్యాగాన్ని సగర్వంగా స్మరించడానికి అర్హుల మవుతాము" అంటూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి 1957 ఆగస్టు 15 వ తేదీ రాత్రి హైద్రాబాదు రేడియో నిలయం నుంచి రాష్ట్ర ప్రజలకు సందేశమిస్తూ ప్రబోధించారు.

ముఖ్యమంత్రి ప్రసంగం పూర్తి పాఠం ఇది :-

"మళ్ళీ ఒక స్వాతంత్ర్య దినం వచ్చింది. అన్నిటి లాగా కాక దీనిలో ఒక విశేషం. నూరేండ్లక్రింద విదేశీయుల పరిపాలనమీద మన దేశంలో తిరుగుబాటు ప్రారంభించారు. అది 1857 లో. ఈనాటికి సరిగ్గా నూరేండ్లు కావటంవల్ల యీ స్వాతంత్ర్య దినోత్సవం మనకు ద్విగుణీకృతానందం కలుగజేస్తుంది.

మనుష్యుడికి నూరేండ్లంటే నిండుజీవితమన్నారు. ఒక దేశచరిత్రలో నూరేండ్లంటే అంత పెద్దవిషయం కాదు. అందులో వేలకొలది సంవత్సరాలనుండి నడుస్తున్న మనదేశచరిత్రలో అది మరీ స్వల్పకాలం. ఏనాడు మన పవిత్రారణ్యాలలో ఋషులు తమ వేద వాక్యా లుచ్చరించారో ఆనాటినుండియే ఒకవిధంగా మనచరిత్ర ప్రారంభించిందనవచ్చు. స్వాతంత్ర్య మనేది అప్పటినుంచీ ఉన్న ఆదర్శమే. అది లేకపోతే జీవిత మేలేదు. అన్నపానీయాలకంటే, భోగభాగ్యాల కంటే, మనపూర్వులు స్వాతంత్ర్యమే అధిక మైనదిగా గణించేవారు. మనుష్యులకే కాదు, జంతువులకు, మృగాలకు సర్వప్రాణులకు స్వేచ్ఛ అవసరము.

స్వాతంత్ర్యోద్యమ మనేది నిజంగా ఒకనాటితో అంతమయ్యేదికాదు. ఇప్పుడూ మన మనుకుంటున్నాము. రాజకీయ స్వాతంత్ర్యం లభించింది, ఆర్థిక స్వాతంత్ర్యం ఇంకా రాలేదని. చాలావిషయాల్లో సాంఘిక స్వాతంత్ర్యంగూడా ఇంకా సంపాదించవలసి వున్నది. ఈ పోరాటం యేదోరూపంలో యెప్పుడూ నడుస్తూనే వుంటుంది. ఆదికాలంలో అసురులూ, రాక్షసులూ క్రౌర్యం ప్రకటిస్తూ అన్యాయమార్గాలు త్రొక్కి సాధువుల నిర్బంధిస్తుంటే వారి స్వేచ్ఛా ప్రాప్తికై ఆర్యవీరులు పాటుబడ్డారు. అంతటితో ఆ అసుర స్వభావం అంతరించిపోలేదు. వివిధ రూపాలలో అప్పు డప్పుడది తల యెత్తుతూనే వచ్చింది. ఒకప్పుడు పరదేశీయులలోనూ, ఒకప్పుడు మన దేశీయులలోనూ దానికి ప్రోద్బలం దొరికింది, కాని అసత్యాన్ని ఏనాటికయినా అణగద్రొక్కి, తాను నిలబడే శక్తి సత్యాని కెలావున్నదో. అదేవిధంగా దాస్య శృంఖాలను త్రెంచుకొని తన ఉన్నతిని ప్రకటించే శక్తిస్వాతంత్ర్యపిపాసకు ఉన్నది. ఇది వ్యక్తిలో

గాని, జాతిలోగాని ఏనాడూ సంపూర్ణంగా అడుగంటిపోయే పిపాసకాదు. పరిస్థితులకు లోబడి కొన్ని కొన్ని సమయాల్లో అది అణిగివున్నా, ఏనాటికైనా బయటబడి తన బలప్రభావాలు ప్రకటించి విజయం పొందే శక్తి అది. అది గ్రహించే, మన పూర్వుల ఆదర్శసారాన్ని అవగాహనం చేసుకున్న ఇప్పటి నాయకులుగూడా ప్రపంచంలో అన్ని జాతులకూ, చిన్నవైనా, పెద్దవైనా, బలవంతమయినవయినా, బలహీనమైనవైనా సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండేట్లు చూడవలెనని బోధిస్తున్నారు. ప్రపంచ చరిత్రలో కొంతకాలం స్థిమితంగా ఉన్నట్లు కనపడ్డ సామ్రాజ్య తత్త్వాలు మానవాభివృద్ధికి ఆటంకాలనీ, నిలబడజాలవనీ స్పష్టీకరిస్తున్నారు. ఈ సత్యం ఇప్పుడు మన దేశంలోనేగాక సామ్రాజ్య స్థాపనకై పాటుపడుతూ వచ్చిన ఇతర దేశాలలోగూడా గ్రహింపబడుతూ వున్నది. వారుగూడా తమక్రింద చాలకాలంనుంచీ లోబడివున్న దేశాలకు కొంచెం కొంచెంగానయినా ఇప్పుడు స్వేచ్ఛ ఇచ్చేవిధానాలను అవలంబిస్తున్నారు. ఈ ప్రపంచ పరిణామానికి కొంతవరకు మన దేశంలో ప్రజ్వరిల్లి విజయం ప్రకటించిన స్వాతంత్ర్యజ్వాల కారణం కాకపోలేదు. ఆత్మజ్ఞానులయిన వారి బోధనలవల్ల, జాతిలో సహజంగావున్న నైతికబలంవల్ల స్వార్థత్యాగ ధురీణులైన నాయకులెందరో బయలుదేరి యీ స్వాతంత్ర్యజ్యోతిని మన దేశచరిత్రలో అనేకసార్లు ఆరిపోకుండా నిలబెట్టారు. సుభిక్షమై రత్నగర్భ అయిన మనదేశంమీద విదేశాలనుండి దండయాత్రలుజరగటం ఆశ్చర్యంకాదు. అలా వచ్చిన వారిలో కొందరు కొన్ని సద్గుణాలుగూడా ప్రకటించటంవల్లనూ, తెలివితేటలు గలవారు కావటం వల్లనూ తమరాజ్యం సుస్థిరంగా స్థాపించుకున్నట్లు కనబడ్డారు. కాని ఆ సుస్థిరత శాశ్వతమైనదికాదు. అణగివున్న స్వేచ్ఛా పిపాసను ప్రజలలో ప్రజ్వరిల్ల చేసే మహాశక్తులు అప్పుడప్పుడు ఉదయిస్తూ అలాంటి బలవంతమైన రాజ్యాలనుగూడా పెకలించి వేయగలిగినవి. అనేకసార్లు ఈవిధంగా స్వాతంత్ర్య సమరం మన గడ్డమీద బీభత్స స్వరూపములో నడిచింది. 1857లో ప్రారంభమైన సమరంగూడ యిలాంటిదే. చాలాకాలంనుండి సుస్థిరంగా నాటుకపోయి, భౌతిక బలంలోనేకాకుండా రాజనీతిజ్ఞతలోకూడా పైచేయిగా కనిపించి యితర దేశాలలో మంచి పలుకుబడిగల పరాయి ప్రభుత్వంమీద మన ప్రజల్లో కొందరు తిరగబడ్డారు. ఆయుధాలలోనూ శత్రువులకు తాము సమానం కాదని వారికి తెలుసు. అయినప్పటికి తాము అనుభవిస్తున్న బాధలు ఇక సహించలేక, దేశంలో అమాయకులయిన ప్రజలమీద జరుగుతున్న అన్యాయం, ద్రోహం ఏవిధంగానైనా అంత మొందించవలెననే పట్టుదలతో వారు సాహసించి తిరుగుబాటు సాగించారు. దానికి ఫలితంగా విదేశీయ ప్రభుత్వంవారిపై జరిపిన హింసాకాండకు మితిలేదు. అయినప్పటికీ కొన్నిచోట్ల తిరుగుబాటు దారులు విజయపతాకను స్థాపించి ఆంగ్లప్రభుత్వం అంతరించినట్లుగా కూడా ప్రకటించారు. ఆ విజయమే సుస్థిరమైనదని యెవ్వరూ అనుకోలేదు. కాని దానిసత్త్వానికే లొంగిపోకుండా మన దేశీయులు అంతమాత్రమైనా చేయగలిగారనే వార్త మన దేశంలోనేకాక ఇతర దేశాలలోకూడా హర్షం కలిగించింది. కారల్ మార్క్సువంటి తత్త్వజ్ఞులప్పుడీ పరిణామాన్ని గూర్చి విదేశ పత్రికలలో దీర్ఘ వ్యాసాలు వ్రాశారు. ఆతిరుగుబాటు అణచివేయ బడ్డప్పటికీ, అది మన దేశచరిత్రలో ఒక అమర ఖండమై ముందు తరాలవారికి ఉత్తేజజనకంగా వున్నది. ఆ మహా సంగ్రామాన్ని గూర్చి నూరేండ్లతర్వాత మన ప్రజలు నేడు స్మరించుకుని వర్ణించుకుని సంతోషంతో ఉత్సవాలు చేసుకుంటున్నారు. ఆ సంగ్రామంలో ఆత్మార్పణం చేసిన వీరులను ప్రశంసించి వారికి జ్ఞాపక చిహ్నాలను నెలకొల్పుతున్నారు. మన రాష్ట్రంలోగూడా ఆనాటి స్వాతంత్ర్య జ్యోతి ప్రజ్వరిల్లకపోలేదు. ఈ నగరంలోనే పుత్లీబావులీ అనేచోట మన వీరులు కొందరు ఆత్మార్పణం చేయవలసి వచ్చింది. దానికి స్మారక చిహ్నం ఒకటి ఇప్పుడు మనం నెలకొల్పుతున్నాము.

ఆనాడు భారత ప్రజల్లో పునరుజ్జీవితమైన స్వేచ్ఛా కాంత, తాత్కాలికంగా అణగద్రొక్కబడినా అడుగంటిమాత్రం పోలేదు. కొన్నాళ్లు ఉజ్జ్వలంగా దేశంలో అనేకచోట్ల అది వెలుగుతూనే వున్నది. కలిగిన పరాజయాన్ని వితర్కించుకొని సరియైన కొత్త మార్గా లేర్పరుచుకొనగల నాయకులు బయలుదేరారు. కొందరు తీవ్రమైన పోరాట

మనీ, కొందరు సామమార్గమనీ, మరి కొందరు సామ దాన భేద దండోపాయాలన్నీ సముయోచితంగా అవలంబిస్తూ సాధించవలెననీ వాదిస్తూ వివిధ రంగాలలో తమ శక్తివంచన లేకుండా పాటుపడ్డారు. ఈ అన్ని మార్గాల సమన్వయం తుట్టతుదకు మనకు మహాత్ముని నాయకత్వంలో రూపొందినది. మహర్షుల ఆత్మజిజ్ఞాస, మహాభారత వీరుల ధైర్య స్థైర్యాలు, యోగిపుంగవుల సత్య వైరాగ్యదీక్ష, సిద్ధుల జీవకారుణ్య ప్రేమాది సద్గుణాలన్నీ ఒకచోట మూర్తీభవించి మన స్వాతంత్ర్య సమరానికి పరిణత స్థితిలో విజయసారథిగా మహాత్ముడు లభించాడు. ఆయనకు చేదోడువాదోడుగా దేశమంతటా గొప్ప నాయకులెందరో ఉద్భవిల్లి తమ సర్వస్వమూ స్వాతంత్ర్యదేవికి కానుకగా అర్పించి యెట్టకేలకు సుస్థిరమైన విజయం సాధించారు. పదేండ్లక్రింద మన దేశానికి మళ్ళీ స్వాతంత్ర్యం లభించింది. విశ్వసనీయులూ సమర్థులూ అయిన మన నాయకులు పరిపాలన సాగిస్తూ యీ స్వాతంత్ర్య వృక్షానికి తగినంత దోహదం చేస్తున్నారు. పోరాటంలో మునిగివున్నప్పుడు మన ప్రజలు స్వార్థ త్యాగులై తమకు ఆర్థికంగా ఉన్న లోటుపాటులను సహింపక తప్పింది కాదు. మన నాయకులే మనకు ప్రభులయినారనగానే ఆ అణగివున్న కోరికలన్నీ పైకుబుకకతప్పదు. ఉన్న దారిద్ర్యం, కరువుబాధ, అజ్ఞానం, వ్యాధిపీడ-అన్నీ ఒక్కసారిగా పోవలెననే ఆకాంక్ష మనలో ప్రజ్వరిల్లింది. ఈఆదర్శం సాధించటానికి ప్రభుత్వమూ ప్రజలూ కలిసి చేతనైనంతగా సర్వతోముఖమైన ప్రయత్నం చేస్తున్నాము. మనం అందుబాటులో ఉన్న ఐశ్వర్యాన్ని శక్తిసామర్థ్యాలను సద్వినియోగం చేసుకునేందుకు వీలుగా పంచవర్ష ప్రణాళిక ఒకటి దేశానికంతటికీ యేర్పరచుకొని జయప్రదంగా కొనసాగించుకున్నాము. ఆ ప్రణాళిక కార్యక్రమ ఫలితంగా దేశంలో సగటు ఆదాయం అనుకున్నదానికంటె యెక్కువగానే వృద్ధిపొందింది. ఇప్పుడు అంతకంటె పెద్దదిగా రెండవ ప్రణాళికను తయారుజేసి నడుపుతున్నాము. ఇటువంటి ప్రణాళికలు ఇంకా ఒకటి తరువాత ఒకటి యెన్నో తయారుచేసి ఆచరణలో పెట్టటంవల్ల చిరకాలంనుంచీ మన ప్రజాబాహుళ్యాన్ని పీడిస్తున్న దారిద్ర్యం అడుగంటిపోయి దేశం మళ్ళీ సస్యశ్యామలం, సుభిక్షంగా కావటమే కాకుండా, పరిశ్రమల ప్రగతిలోనూ శాస్త్ర విజ్ఞానంలోనూ గూడా మనమేజాతికీ తీసిపోకుండా ఉండగలమనే విశ్వాసం మనకున్నది.

స్వాతంత్ర్యం లభించినతర్వాత దేశంలో కలిగిన గొప్ప పరిణామాలలో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ ఒకటి. ఈ మార్పుకు మొట్టమొదటినుంచీ తీవ్రంగా పోరాడిన వారు ఆంధ్రులు. వారి కోర్కె ఉచితమైనదని రాజకీయ నాయకులేగాక శ్రీ అరవిందుని వంటి యోగీశ్వరులుగూడా ఆశీర్వదించినారు. దాని సత్వర సిద్ధికై పొట్టి శ్రీరాములవంటి స్వార్థత్యాగులు బలి అయినారు. తుట్టతుదకు మన విశాలాంధ్ర రాష్ట్రం మనకు వచ్చింది. వెంటనే దేశంలో ఎన్నికలు జరగటం, ప్రజలు సుస్థిరమైన ప్రభుత్వాన్ని యెన్నుకొనటం గూడా ఒక దైవికమైన ఆశీస్సుగా మనం భావించవచ్చు. ఈ క్రొత్తరాష్ట్రం అవతరించి పది నెలలైనా కానప్పుడు దీనిలో ఏ రంగాలలో అభివృద్ధి ఎంతెంత జరిగింది అని చర్చించటానికి అంతగా వీలుపడదు. కాని, మొత్తంమీద మన ఇరవై జిల్లాలలోనూ, ప్రణాళికా ప్రారంభం కాలంలోని పరిస్థితులను ఇప్పటి పరిస్థితులను పోల్చిచూస్తే, సర్వతోముఖమైన అభివృద్ధి, యెవరి దృష్టికయినా గోచరిస్తుంది. సామాజికాభివృద్ధి కార్యక్రమంలో మన ఆంధ్రప్రాంతంలోని ప్రగతి ప్రధానమంత్రి ప్రశంసకు పాత్రమైంది. ఆహారోత్పత్తిలో, నీటివనరు సౌకర్యాలు కల్పించుకొనటంలో, విద్యుచ్ఛక్తి, ప్రయాణ సౌకర్యాలు, విద్య, ఆరోగ్యం, వైద్య సౌకర్యాలు, గృహనిర్మాణం, వెనుకబడిన తరగతులవారికి సహాయం— మొదలయిన వాటన్నిటిలో మనం ముందుకు నడుస్తూనే వున్నాము. మన రాష్ట్రం భౌతికంగా ఐశ్వర్యవంతమయినప్పటికీ, దానిని అనుభవ యోగ్యంగా చేసుకొనటానికి మన ఉత్సాహ దీక్షలే చాలవు. సంపద, సహాయం కావలసి వున్నది. ఇది కొంతవరకు కేంద్ర ప్రభుత్వంవల్ల లభిస్తున్నది. మిగిలినది మనలోనుంచే ఉత్పన్నం కావలసి వున్నది. క్రొత్త పరిశ్రమలను స్థాపించే విషయంలో మనకోరికలు పూర్తిగాఫలించ

[తరువాయి 19 వ పేజీలో]

# సిపాయీల తిరుగుబాటు కాదు- స్వాతంత్ర్య సమరం

*1857 పోరాటం కొందరు బ్రిటీషు చరిత్రకారులు వ్రాసినట్లుగా సిపాయీల తిరుగుబాటుకాదు. ఆ పోరాటంలో అనేక లోపాలుండవచ్చు. కాని నిష్పాక్షికంగా పరిశీలించి నట్లయితే అది భారత ప్రథమ స్వాతంత్ర్య సమరమని విదితమవుతుంది. భారతదేశం స్వతంత్ర మయిన తరువాత ప్రశాంత వాతావరణంలో ఎట్టి ఉద్వేగాలు లేకుండా కేవలం చారిత్ర కాధారాలనే దృష్టిలో పెట్టుకొని గత చరిత్రను పరిశీలించడం ఇటీవలనే సాధ్యమయింది. భారత ప్రభుత్వంచే నియమింపబడ్డ ప్రముఖ చరిత్రకారుడు డా. యస్. యన్. సేన్ "యైటీన్ ఫిఫ్టీ సెవెన్" అను పేరుతో 1857 పోరాటంయొక్క చరిత్రనుగూర్చి ఉద్గ్రంథం వ్రాశాడు. ఆ గ్రంథం ఈ సంవత్సరం మే 10 వ తేదీన విడుదల చేయబడింది. సరిగ్గా నూరేళ్ళక్రిందట ఈ తేదీనాడే మీరట్‌లో మొట్టమొదట పోరాటం ఆరంభమైంది.*

డాక్టర్ సేన్ గ్రంథాంతంలో వ్రాసిన "సింహావలోకనం" అనే అధ్యాయంలోనూ, మౌలానా అబుల్ కలాం అజాద్ పుస్తకానికి వ్రాసిన పీఠికలోనూ, 1857 పోరాటంయొక్క స్వభావాన్ని గూర్చి పూర్తిగా చర్చించబడింది. వారు వ్రాసిన యీ క్రిందిభాగాలు, ఆ గ్రంథంనుండి ఉద్ధృతములయినవి. "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" అనే గ్రంథంలో పండిత జవహర్ లాల్ నెహ్రూ యిదే విధమయిన స్వభావ పరిశీలన చేశారు.

ఈ తిరుగుబాటు సంయుక్త పరగణాలు, ఢిల్లీ, ప్రాంతాలలో సర్వత్రా వ్యాపించింది. మధ్య భారతం బీహారు రాష్ట్రాలలో కొంతవరకు వ్యాపించింది. ఇది కేవలం సైనికుల తిరుగుబాటు మాత్రమే కాదు. ఈ ప్రాంతాలలో బ్రిటీషువారికి వ్యతిరేకంగా యిదొక సాధారణమయిన ప్రజల తిరుగుబాటుగా రూపొందింది. చిట్టచివరి మొగల్ చక్రవర్తి బహదూర్‌షా వయోవృద్ధుడు, కవి కూడా. ఆయనను కొందరు సింహాసనమెక్కించి, చక్రవర్తిగా ప్రకటించారు. తిరుగుబాటు క్రమంగా అందరూ ద్వేషించిన పరాయి పాలనకు వ్యతిరేకంగా భారత స్వాతంత్ర్య సమరంగా రూపొందింది. కాని ఆ స్వాతంత్ర్యం భూస్వామ్య యుగానికి చెందినట్టిది. నిరంకుశులయిన చక్రవర్తులు పోరాటానికి నాయకులు. సామాన్యులకు కావలసిన స్వాతంత్ర్యం లేదు. అయినా ప్రజలు అధిక సంఖ్యాకులు పోరాటములో ఎందుకు చేరారంటే, బ్రిటిష్ వారు వచ్చినందుననే తమకీ దుర్భర దారిద్ర్యం సంభవించిందనే విషయం వారు గుర్తించారు. కొన్నిచోట్ల మాత్రం భూస్వాముల పలుకుబడికిలోనై ప్రజలు తిరుగుబాటు వైపుకు మ్రొగ్గారు. మతద్వేషంకూడా ఒక కారణమే. హిందువులు, మహమ్మదీయులుకూడా పూర్తిగా పోరాటంలో పాల్గొన్నారు.

## ప్రజోద్యమ విజృంభణ

*మౌలానా ఆజాద్ ఈ విధంగా వ్రాశారు:* "లభించిన ఆధారాల దృష్ట్యా, 1857 పోరాటం ముందే జాగ్రత్తగా ఆలోచించుకొని ప్రారంభించింది కాదనీ, యీ ఉద్యమం వెనుక ఆలోచనతో నడిపిస్తున్న నాయకులెవరూ లేరనే మనం నిర్ణయించుకోవలసి వుంటుంది. అసలు జరిగిందేమంటే, 100 సంవత్సరాల కాలంలో, కంపెనీ పరిపాలన అంటే భారతీయులలో అసంతృప్తి, అసహ్యం ప్రబలింది. మొదట్లో కంపెనీవారు తమ కార్యకలాపాలన్నీ నవాబులు లేక చక్రవర్తి పేరుమీదనే జరుపుకుంటూ వచ్చినందున, చాలాకాలంవరకు కూడా, విదేశీయులు అధికారం సంపాదించారనే ఊహ భారతీయులకు కలుగనేలేదు. తమ దేశంలో తాము బానిసలైపోయామని వారు

గుర్తించనేలేదు, ఎప్పుడయితే నిజపరిస్థితి గ్రహించి, ప్రజలు చైతన్యవంతులయినారో, ప్రజోద్యమ విజృంభణకు ఆవకాశం లభించింది. ఈ విజృంభణ, ఏదో కొద్దిమందివ్యక్తులు, లేక గ్రూపులు కుట్రచేసినందువల్ల రేగిందికాదు; అశేష ప్రజానీకంలో రేగిన అసంతృప్తి అగ్నిజ్వాలలే యీ విప్లవానికి మూలకారణం."

వంలో పాల్గొన్నవారు దేశభక్తి ప్రేరితులనే విషయం నిర్వివాదం, కాని అంత విప్లవం జరగటానికి అదే కారణం కాజాలదు.

దేశభక్తికి తోడు మత విశ్వాసాలను కూడా రెచ్చగొట్ట వలసిన పరిస్థితి కలిగింది. అప్పుడే ప్రజలు పూర్తిగా మేల్కొన్నారు. తూటాలకు క్రొవ్వు పూయ



రాణీ ఝాన్సీ లక్ష్మీబాయి

## దేశభక్తి, మతాభిమానం

1857 పోరాటం గురించి వ్రాయబడిన వివిధ పరిశీలనలను చూచిన తర్వాత మనం కొన్ని నిర్ణయాలకు రాక తప్పదు. జాతీయభావ విజృంభణమే యీ విప్లవానికి కారణమా అనే ప్రశ్న ప్రధానంగా మనలను ఎదుర్కొంటుంది. జాతీయభావమును గురించి మనము సరియైన ఆధునిక దృక్పథము కలిగివుంటే పైప్రశ్నకు అవునని ఖచ్చితంగా సమాధానం చెప్పుకోలేము. విప్ల

బడిందనే ప్రచారం యీస్థాయికి చెందినట్టిదే. పరపాలకులకు వ్యతిరేకంగా విప్లవసంరంభ రంగంలోనికి ప్రవేశించే ముందు సైనికులకుగల మతవిశ్వాసాలకు యితర విధాల కూడా దెబ్బతగిలింది.

## మతవిభేదాలు లేవు

1857 పోరాటంలో రెండు ప్రధానమైన విషయాలు ప్రముఖంగా కనిపిస్తున్నవి. అందులో మొదటిది, పోరాట సమయంలో హిందువులు, మహమ్మదీయుల

మధ్యఏర్పడిన దృఢమైన ఐక్యతాభావం. రెండవది ప్రజలకు మొగల్ సింహాసనముపైగల భక్తి ప్రపత్తులు.

ఈ పోరాటం 1857 మే 10 వ తేదీన ప్రారంభమై సుమారు రెండేండ్లు సాగింది. ఈ కాలంలో, ఉభయ పక్షాలలోను అనేక సాహస కృత్యాలు, ఘోరకార్యాలు, మంచి పనులు కూడా జరిగాయి. సాహసోపేతమైన వీరగాధలు వినిపించాయి. నమ్మశక్యంగాని ఘోర మారణక్రియలు మార్మోగాయి. అయినా యీ రెండేండ్ల కాలంలో మతకలహం ఎక్కడా సంభవించినట్లు ఉదాహరణకు కూడా దొరకదు. హిందువులైనా, మహమ్మదీయులైనా, మొత్తం భారతీయులందరూ ఒకే దృక్పథంతో పనిచేశారు. పరిస్థితులను ఒకే కోణమును నుండి అర్థం చేసుకున్నారు.

ప్రత్యేకంగా నాయకులు ప్రయత్న పూర్వకంగా కృషిచేసినందువల్ల ఏర్పడిందికాదు యీ మత సామరస్యము. హిందూ ముస్లిం ఐకమత్యమును గురించి 1857 పోరాటం నాయకు లెవ్వరూ అంతగా పట్టించుకొని, ప్రచారంచేసినట్లు ఆధారమేమీ కన్పించటం లేదు. శతాబ్దాలుగా తమకు గల జీవిత సంబంధాలకు అనుగుణంగా, హిందూ, మహమ్మదీయుల స్నేహభావానికి శాశ్వతమైన పునాదులు ఏర్పడివున్నవి. అందువల్ల యీ సందర్భంగా ప్రజలనుద్దేశించి ఉద్బోధించటానికి గానీ, మత సామరస్య సిద్ధాంతాన్ని వారికి నచ్చ చెప్పటానికి గానీ అవసరమేలేదు. అందువల్లనే 1857 విప్లవం జాతీయ స్వభావాన్ని కలిగిన పోరాటమైనది, పరదేశీయులతో పోరాటమైనది. అంతేకాని మతకలహాల పరిణామాన్ని పొందలేదు. హిందూ మహమ్మదీయులు భుజం భుజం కలిపి స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. బ్రిటిష్ పరిపాలన నుండి తమ విముక్తి సాధనమే వారికి సమిష్టిగా పరమ లక్ష్యమైనది."

## మొత్తంజాతే విజృంభించింది

*డాక్టర్ సేన్ ఈ విధంగా వ్రాశారు :* "ఏ ఉద్యమంలో నైనా చైతన్య వంతులైన కొందరు మాత్రమే పాల్గొంటారు. అధిక సంఖ్యాకులు దూరంగా వుంటారు. అంతేకాక, ప్రత్యేక ప్రయోజనాలు అనుభవించే ఒక వర్గం బహిరంగంగానే, అప్పటి పరిపాలకుల పక్షం వహించి కూడా పనిచేస్తుంది. 1857 పోరాటం ప్రజా బాహుళ్యంలోనికి ఎంతవరకు చొచ్చుకు పోయిందనేవిషయం చర్చించేముందు పై విషయాలు గుర్తుంచుకోవటం అవసరం. ఎక్కడా, ఏ పోరాటానికి కూడా సర్వ ప్రజల అంగీకారం లభ్యంకాదు.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధంలో విజయం సాధింపబడిన అనంతరం, కెనడాకు వలస వెళ్ళాలనే సంకల్పం గాఢంగా కల రాజరిక వాదుల వర్గం ఒకటి వుండేది. ఫ్రాన్సులో విప్లవం జరిగినప్పుడు కూడా రాచరికవాదులకేమీ కొరతలేదు. బ్రిటన్‌లో స్టూవర్ట్ రాజవంశీకులను సమర్థించేవారు కూడా చాలామంది వుండేవారు. ప్రజానీకం యావన్మంది వచ్చి ఉద్యమంలో పాల్గొనకపోయినా, ఉద్యమ ప్రధాన లక్ష్యలకు అధిక సంఖ్యాకుల సానుభూతి లభించినట్లయితే, దానిని జాతీయోద్యమమని పేర్కొనవచ్చు. ఔధ్, షహాబాద్ ప్రాంతాలకు వెలుపల, యీ తిరుగుబాటును జాతీయోద్యమంగా పేర్కొనటానికి అవసరమైన ప్రజా సానుభూతి ఉన్నట్లుగా ఆధారంలేదు. అయినా దానిని కేవలం సైనికుల తిరుగుబాటుగా చిత్రించడానికి కూడా వీలులేదు. మీరట్ తిరుగుబాటుదార్లు ఢిల్లీ రాజు నాయకత్వాన్ని అంగీకరించి, భూస్వాముల వర్గంలో కొంత భాగం, ప్రజలుకూడా ఆయన నాయకత్వాన్ని కోరుతూ ప్రకటించడంతో ఈ తిరుగుబాటుకు రాజకీయమైన విప్లవ స్వభావం ఏర్పడింది. మత విశ్వాసాలకొరకు పోరాటంగా ప్రారంభమైన ఉద్యమం, స్వాతంత్ర్య సంగ్రామంగా పరిణతి చెందింది. ఎందుకంటే, విదేశీ పరిపాలననుండి విముక్తి సాధించుకోవాలనీ, ఢిల్లీ చక్రవర్తి ఆధ్వర్యాన స్వాతంత్ర్యం సాధించుకోవాలనీ తిరుగుబాటు దార్లు అభిప్రాయపడి, ఆ లక్ష్యంతోనే పోరాటంనడిపారనేది నిర్వివాదమైన విషయం."



# అభివృద్ధి బ్లాకులలో జరుగుతున్న కృషి

స్వయం సహాయం ద్వారా అభివృద్ధి సాధన సమాజాభివృద్ధి కార్యక్రమం యొక్క సందేశం. ఈ కార్యక్రమం యేమేరకు సఫలమవుతుందో దానినిబట్టి యీ సందేశాన్ని మనం యెలా అందుకున్నామో నిర్ణయించవలసి వుంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో యీ పిలుపును గ్రామీణులకు 127 బ్లాకులద్వారా వినిపించడం జరుగుతున్నది. ఈ బ్లాకులలో వివిధ తరగతులున్నాయి. ఈ బ్లాకుల కార్యక్రమంగూర్చి యిటీవల చేయబడ్డ సమీక్షలో గ్రామీణుల వుత్సాహపూరితమైన సహకారాన్ని సూచించే వుదాహరణ లున్నాయి. మన గ్రామాలలో యీ వుద్యమం బాగా వ్యాపిస్తున్నదని అవి ఋజువు పరుస్తున్నాయి.

ఈ రాష్ట్రంలో సమాజాభివృద్ధి కార్యక్రమం సమాజాభివృద్ధి బ్లాకులు, జాతీయ వికాస సేవా కేంద్రాలు, పోస్టు ఇంటెన్సివ్ బ్లాకులు బహుళార్థసాధక ప్రాజెక్టుల ద్వారా అమలు జరుగుతున్నది. మే నెలలో వివిధ రంగాలలో వాటి కార్యకలాపాలు దిగువ పేర్కొనబడినవి.

మామూలు రంగాలలో తగినంత కృషి జరిగినట్టు యీ బ్లాకుల కృషి నివేదికవల్ల తెలుస్తున్నది. అంతేకాక వ్యక్తిగతంగా విరాళాలిచ్చిన సందర్భాలు, సమాజంలోని అందరి సౌకర్యార్థం శ్రమదానం యేర్పాటు చేసిన సందర్భాలు చాలా వున్నట్లు తెలుస్తున్నది. ఉదాహరణకు, కొత్తపేట జా. వి. సే. కేంద్రంలోని వేదపాలెంలో పాఠశాల నిర్మాణానికై ఒక భూస్వామి రూ. 9,000 విలువగల భూమిని విరాళంగా యిచ్చాడుట. ఆతరువాత గ్రామంలోని యితరులు తమలో తాము రూ. 2000 రొఖ్ఖంగాను, రూ. 1000 యిటికల



*హైద్రాబాదులో మకాం చేసిన సందర్భంలో రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ పటన్‌చెర్వు సామాజికాభివృద్ధి బ్లాకును సందర్శించారు. రాష్ట్రపతి అక్కడ సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపి అందులో ప్రదర్శింపబడిన వాటిని వీక్షిస్తున్నారు.*

రూపంలోను మొత్తం రూ. 3000 ప్రోగుచేశారు. అలాగే ఆలూరు సమాజాభివృద్ధి బ్లాకులోని హార్దిగారీ గ్రామంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రం నిర్మాణానికై ప్రజలనుంచి రూ. 20,000, 3 యెకరాలభూమి లభించినది.

చెన్నూరు పోస్టు-ఇంటెన్సివ్ బ్లాకులో స్థానికాభివృద్ధి కార్యక్రమం క్రింద పాఠశాల నిర్మాణానికై బ్లాకు సిబ్బంది ప్రజల వాటాగా రూ. 2,000 వసూలు చేయగలిగారు. జంగమరెడ్డి పాలెంలో రూ. 3,000 విలువగల సత్రాన్ని స్వయంసహాయం ప్రాతిపదికపై స్థానికులు నిర్మించారు. పెందుర్తి సమాజాభివృద్ధి బ్లాకులో ½ మైలు పొడవు రోడ్డును నిర్మించి దానితో రెండు గ్రామాలను కలపడం జరిగింది. ఇందుకు ఆ రెండు గ్రామాల ప్రజలు కలిసి పనిచేశారు.

## సమాజాభివృద్ధి బ్లాకులు

సమీక్ష చేయబడుతున్న నెలలో 21,135 మ. ఉత్తమ విత్తనాలు, 20,282 మ. రసాయన యెరువులు, 2,174 ఆధునిక పరికరాలు పంపిణీ చేయబడినవి. 326 యె. జపాను పద్ధతి వరిసాగు ప్రవేశపెట్టబడింది. 9,737 యెరువుగుంటలు 6,768 పెంట యెరువుగుంటలు త్రవ్వబడినవి. పశుపోషణ రంగంలో 44 మేలిరకం పోతుపశువులు, 1,196 మేలిరకం పుంజు పక్షులు సప్లయి చేయబడినవి. 3,344 పశువులకు విత్తు కొట్టబడింది.

ఈ నెలలో 1,222 యెకరాలు సాగుక్రిందికి తేబడినవి. 13,376 యె. బాగుచేయబడినవి.

70 మంచినీటి బావులు నిర్మించబడినవి. 392 బాగుచేయబడినవి. 2,708 సోకేజి గుంటలు త్రవ్వబడినవి. 1,908 పొగరాని పొయ్యిలు, 738 మరుగుదొడ్లు నిర్మించబడినవి. 43,569 గజాల మురుగు కాల్వలు త్రవ్వబడినవి.

విద్య, సాంఘిక విద్య కార్యక్రమం క్రింద 4 పాఠశాలలు తెరువబడినవి. 22 మామూలు పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి. ప్రజల సంస్థల యూనిట్లు 334 అభివృద్ధి చేయబడినవి. 126 కమ్యూనిటీ సెంటర్లు, 58 వయోజన విద్యాకేంద్రాలు ప్రారంభింపబడినవి. ఈ నెలలో 1,317 మంది వయోజనులు అక్షరాస్యులయినారుట.

18 మైళ్ళ 2 ఫర్లాంగుల పొడవుగల పక్కా రోడ్లు 61 మైళ్ళ నిడివిగల కచ్చారోడ్లు నిర్మించబడినవి. ఇంచుమించు 90 మై. పొడవు కచ్చారోడ్లు మరమ్మతు చేయబడినవి.



సెక్రటేరియేట్‌లో ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు పార్లమెంటు సభ్యులతో రాష్ట్రంలో అమలుజరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి చర్చలు జరుపుతున్నారు.

21 సహకారసంఘాలు ప్రారంభింపబడినవి. 3,617 మంది కొత్తసభ్యులు సహకార సంఘాలలో చేర్చుకొనబడ్డారు. 1,541 హుండీపెట్టెలు పంపిణీ చేయబడ్డాయి. పొదుపు వుద్యమం క్రింద రూ. 47,244 వసూలు చేయబడినవి.

## జాతీయవికాస సేవాకేంద్రాలు

సమీక్ష చేయబడుతున్న నెలలో 61 జా. వి. సే. కేంద్రాలు 44,248 మ. వుత్తమ విత్తనాలు, 20,283 మ. రసాయన యెరువుల్ని పంపిణీ చేయగలిగాయి. 2,666 డిమానుస్ట్రేషనులు జరుపబడినవి. 1,777 యె. జపాన్ పద్ధతి వరిసాగుక్రిందికి తేబడినవి. 3,550 ఆధునిక పరికరాలు పంపిణీ చేయబడినవి; 16,763 ఎరువు గుంటలు, 7,770 పెంట యెరువుగుంటలు త్రవ్వబడినవి. 20,349 యెకరాల భూమి బాగుచేయబడింది. అదనంగా 3449 యెకరాలు సాగుక్రిందికి తేబడింది.

88 మంచినీటి బావులు నిర్మించబడ్డాయి. 230 బాగుచేయబడినవి. 514 మరుగుదొడ్లు నిర్మించబడినవి. 55,455 గజాల పొడవు మురుగు కాల్వలు త్రవ్వబడినవి.

9 కొత్త పాఠశాలలు ప్రారంభింపబడినవి. 19 మామూలు పాఠశాలలు బేసిక్‌రకం పాఠశాలలుగా మార్చబడినవి. కొత్త పాఠశాలలు 9 లోను 3 ప్రభుత్వేతర యేజన్సీలచే ప్రారంభింపబడినవి.

దగ్గరగా 16½ మైళ్ళ పక్కారోడ్లు, 57 మై. కచ్చారోడ్లు నిర్మించబడినవి. 33 మై. కచ్చా రోడ్లకు మరమ్మతులు చేయబడినవి. సాంఘిక విద్యాకార్యక్రమం క్రింద 64 వయోజన విద్యాకేంద్రాలు, 173 కమ్యూనిటీకీ సెంటర్లు ప్రారంభింప బడినవి. ప్రజల సంస్థల యూనిట్లు 360 అభివృద్ధి చేయబడినవి. 744 మంది వయోజనులు అక్షరాస్యులుగా చేయబడ్డారు.

సహకారం క్రింద 40 కొత్త సహకార సంఘాలు స్థాపించబడ్డాయి. అదనంగా 4,379 మంది సభ్యులు చేర్చబడ్డారు. పొదుపును ప్రోత్సహించడానికై 1,421 హుండీ పెట్టెలు పంపిణీ చేయబడినవి. ఈ నెలలో పొదుపు వుద్యమం క్రింద రూ. 27,614-00 వసూలు చేయబడినవి.

## పోస్టు - ఇంటెన్సివ్ బ్లాకులు

వ్యవసాయ కార్యక్రమంక్రింద 22 పోస్టు ఇంటెన్సివ్ బ్లాకులలోను- వీటిలో 16 ఆంధ్రలో వున్నాయి- 26,610 మ వుత్తమ విత్తనాలు, 14,889 మ రసాయన యెరువులు, 372 ఆధునిక పరికరాలు పంపిణీ చేయబడినవి. 4,519 సాంస్కృతిక మున్నగు డిమాన్‌స్ట్రేషన్లు జరుపబడినవి. 634 డిమాన్‌స్ట్రేషన్ ప్లాట్లు నిర్మించబడినవి, 4,375 ఎరువు గుంటలు, 1,987 పెంట యెరువు గుంటలు త్రవ్వబడినవి. 1,863 ఇంటితోటలు వేయబడినవి, ఆంధ్రలో 538 యె. భూమి సాగుక్రిందికి తేబడింది, రాష్ట్రమంతటిలోను 3,496 యె. బాగుచేయబడినవి.

ఆరోగ్య, పారిశుద్ధ్య కార్యక్రమం క్రింద 43 మంచినీటి బావులు నిర్మించబడినవి. 77 బాగుచేయబడినవి. 377 మరుగుదొడ్లు, 177 పొగరాని పొయ్యిలు నిర్మించబడినవి. 13,007 గజాల మురుగు కాల్వలు నిర్మించబడినవి.

రెండు కొత్త పాఠశాలలు తెరువబడినవి. 8 మామూలు పాఠశాలలు బేసిక్‌రకం పాఠశాలలుగా మార్చబడినవి. ప్రజల సంస్థ యూనిట్లు 104 అభివృద్ధిపరచబడినవి. 58 కమ్యూనిటీ సెంటర్లు, 14 వయోజనవిద్యా కేంద్రాలు ప్రారంభింపబడినవి. 470 మంది వయోజనులు అక్షరాస్యులు చేయబడ్డారు.

13 సహకార సంఘాలు ప్రారంభించబడినవి. 1346 మంది కొత్త సభ్యులు చేర్చబడ్డారు.

పొదుపును ప్రోత్సహించడానికై 1,231 హుండీపెట్టెలు పంపిణీ చేయబడినవి. పొదుపు మొత్తాలుగా రూ. 86,694 వసూలు చేయబడినవి.

## బహుళార్థ సాధక ప్రాజెక్టులు

ఆంధ్రలో రెండు, తెలంగాణాలో రెండు, రాష్ట్రంలో మొత్తం 4 బహుళార్థసాధక ప్రాజెక్టు లున్నాయి. తెలంగాణాలో అవి నరసంపేట, వుంటూరులలోను, ఆంధ్రలో అరకు, హుకుంపేటలలోను వున్నాయి. వీటి ద్వారా యీ నెలలో 356 మ. ఉత్తమ విత్తనాలు, 112 పౌ. రసాయన యెరువులు పంపిణీ చేయబడినవి. ఇంచుమించు 128 యె. భూమి బాగుచేయబడింది.

195 సోకేజి గుంటలు త్రవ్వబడినవి. 23 మై. పొడవు కచ్చారోడ్లు నిర్మించబడ్డాయి. సహకార సంఘాలలో 49 మంది కొత్త సభ్యులు చేర్చుకోబడ్డారు. 29 హుండీపెట్టెలు పంచబడినవి. పొదుపు మొత్తాలుగా రూ. 52 వసూలుచేయబడినవి.

ప్రజలవంతుగా రూ. 7,30,942 లు సంపాదించబడినవి. ఈ నెలలో ప్రభుత్వ ఖర్చు రూ. 16,56,987. ఈ 127

బ్లాకుల కార్యక్రమాలవల్ల 1,73,549 కుటుంబాలకు మేలు కలిగింది. 12,244 క్రొత్త కుటుంబాలకు సహకారం సౌకర్యాలు లభింపచేయబడినవి.

అరకులో ఒకరోడ్డు నిర్మాణంలో కొండజాతి స్త్రీ పురుషులు పెక్కుఁరు పాల్గొన్నారు. జలాల్‌పూరు గ్రామంలో రెండు రోజులు జాతర జరుపబడింది. దీనికి దగ్గరగా 1,500 మంది పురుషులు వచ్చారు. గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు పెక్కుఁనడుపబడినవి. వరంగల్లులో జిల్లా స్థాయి గోష్ఠి జరుపబడింది. 3 బ్లాకు స్థాయిగోష్ఠులు జరుపబడినవి.

* * *

---

## 1857 స్వాతంత్ర్య సమరం

[9 వ పేజీ తరువాయి]

గిందో తెలుస్తుంది. కొప్పల్‌లో 70 మందికి పైగా ఉరి తీయబడినట్లు, ఔరంగాబాదు జిల్లాలోని వైజాపూరు తాలూకాలో అనేకమంది భిల్లులు చంపబడినట్లు, పర్భణిజిల్లాలోని బస్మత్ తాలూకాలో చాల మంది రోహిలాలు చంపబడినట్లు రికార్డులవల్ల తెలుస్తున్నది. ఇంకా కొన్నివందలమందికి యావజ్జీవ కారాగారవాసశిక్ష ఇతరశిక్షలు విధింపబడ్డవి. లక్షల కొద్ది విలువైనఆస్తులు జప్తు చేయబడ్డవి. ఈవిధంగా 1857 భారత ప్రథమ స్వాతంత్ర్య సమరంలో హైదాబాదుకూడా పూర్తిగా పాల్గొన్నది."

---

## ముఖ్యమంత్రి రేడియో ప్రసంగం

[12 వ పేజీ తరువాయి]

లేదని మీ కందరికీ తెలుసు. కాని తొలుదొల్త కనిపించే అడ్డంకులనన్నిటినీ లక్ష్యపెట్టక మన స్వాతంత్ర్య సమరం యెంత పట్టుదలతో సాగించామో, మన విశాలాంధ్ర రాష్ట్రంకోసం యెంతటి దీక్షతో పాటుపడ్డామో అదే పట్టుదలతో, దీక్షతో మన రాష్ట్ర పురోభివృద్ధికై మనం పాటు పడవలసి వున్నది. ఇది ప్రభుత్వమూ, ప్రజలూ చేయిచేయీ కలిపి నడువవలసిన మార్గం ; ఇందులో పెద్ద చిన్న తారతమ్యాలేవీ లేవు ; ముఖ్యమంత్రి కెంతబాధ్యత వున్నదో సామాన్య కర్షకుడికికూడా అంతే బాధ్యతవున్నది. దీనికై ఆర్థికంగాగానీ వ్యక్తిగతంగాగానీ మనం యెట్టి త్యాగం చేయవలసివచ్చినా సిద్ధంగావుండాలి. అప్పుడే మనం నూరేండ్లక్రింద స్వాతంత్ర్యపతాక యెత్తిన ఆ వీరుల త్యాగాన్ని సగర్వంగా స్మరించడానికి అర్హులమవుతాము."



# సామర్లకోట ఎక్స్‌టెన్షన్ ట్రైనింగు కేంద్రం

## వివిధ శిక్షణ కోర్సుల వివరణ

శ్రీ. జి. వి. రత్నం
ప్రిన్సిపాల్
*సామర్లకోట ఎక్స్‌టెన్షన్ ట్రైనింగు కేంద్రం*

సామర్లకోట ఎక్స్‌టెన్షన్ ట్రైనింగు కేంద్రం ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రధానమైన శిక్షణకేంద్రాలలో ఒకటి. ఫోర్డు ఫౌండేషన్ సహాయంతో భారతదేశంలో నెలకొల్పబడిన తొలిజట్టు 34 విస్తరణ శిక్షణ కేంద్రాలలో ఇది ఒకటి.

సామర్లకోట విస్తరణ శిక్షణ కేంద్రం అది ప్రస్తుతం వున్నచోటికి 3 మైళ్ళ దూరంలో పెద్దాపురంలో ఒక అద్దె భవనంలో 8-12-52 న తెరువబడింది. ఆ తరువాత సామర్ల కోటలో 100 యెకరాల ప్రభుత్వభూమి అందుబాటులో వున్నట్టు కనుగొనబడింది. ఆ కేంద్రాన్ని పెద్దాపురం నుంచి సామర్లకోటకు తరలించి, ఆ ప్రదేశాన్ని వ్యవసాయ క్షేత్రముగా అభివృద్ధిచేసి అవసరమైన భవనాలను నిర్మించాలని నిశ్చయించబడింది. ఆ నిర్ణయానుసారం 1954 మే నెలలో ఆ కేంద్రం సామర్లకోటలోని ఒక అద్దెభవనములోనికి తాత్కాలికంగా తరలించబడింది. ప్రస్తుతపు భవనాలు స్వల్పకాలంలో అనగా మూడు నెలల్లో నిర్మించబడ్డాయి. 1955 ఏప్రిల్‌నుంచే యీ కేంద్రం తన స్వంతభవనాల్లో పని చేస్తున్నది. దీనికి ప్రస్తుతం వ్యవసాయయోగ్యమైన భూమి 50.00 యెకరాలు, తోట ప్రదేశం 12.00 యె. ఒక పాడి పరిశ్రమ కేంద్రము వున్నాయి. ఈ కేంద్రం సామర్లకోట రైలుస్టేషన్‌కి ఒక మైలు దూరంలో గ్రామీణ



*సామర్లకోట ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ కేంద్రంలో గ్రామసేవికలు తోటపని శిక్షణ పొందుతున్న దృశ్యం.*



కేంద్రంలో శిక్షణపొందుచున్నవారు జపాను పద్ధతి వరిసేద్యం నేర్చుకుంటున్నారు.

పరిసరాలలో వున్నది. దానికి అన్నివైపులనుంచి మంచి రోడ్లున్నవి. చక్కగా నిర్మించబడిన భవనాలున్నాయి. శిక్షణపొందేవారి గదులకు ఆధునిక సౌకర్యాలు కల్పించబడినవి. వారికి వినోదకాలక్షేపానికి తగిన వసతులున్నాయి. ఆడుకొనుటకు ఆటస్థలాలు, కేరంబోర్డుల వంటి ఆటల సాధనాలు వున్నాయి. వ్యాయామశాల, రిక్రియేషన్, రీడింగు రూములున్నాయి. మ్యూజియం, గ్రంథాలయం వున్నాయి.

## శిక్షణ తరగతులు

ఈ శిక్షణకేంద్రం ప్రారంభమైనది మొదలు దాని కార్యక్రమాలను విస్తృత పరుస్తున్నది. ఇది మొదట గ్రామీణ కార్యకర్తల శిక్షణకై ఒక షిప్టుగల శిక్షణ కేంద్రముగా పని ప్రారంభించింది. 1955 జనవరిలో బేసిక్ వ్యవసాయవింగ్‌తో రెండు షిప్టులుగల కేంద్రంగా మార్చబడింది. గ్రామసేవికల శిక్షణకై ఒక గృహశాస్త్రవింగ్ గ్రామీణ చేతిపనివారి శిక్షణకై వర్కుషాపు సెక్షన్, బ్లాక్ లెవెల్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల శిక్షణకై ఓరియంటేషన్ ట్రయినింగు కోర్సు, గ్రామపంచాయితీల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు మరొకటి, ఒకటి తరువాత ఒకటి కాలక్రమేణా దీనికి చేర్చబడినవి.

*బేసిక్ వ్యవసాయ శిక్షణ* :- ఇది గ్రామస్థాయి కార్యకర్తలకు ఒక సంవత్సరంపాటు గరపబడుతుంది. గ్రామీణ కార్యకర్తలకు అవసరమయిన ప్రాథమికమయిన విజ్ఞానాన్ని సమకూర్చడానికై వ్యవసాయం, పశుపోషణల గురించి ప్రధానంగా బోధించబడుతుంది. ఈ శిక్షణ అనంతరము విస్తరణ పద్ధతులలో మరికొంత శిక్షణ యివ్వబడుతుంది. శిక్షణపొందే కాలంలో వారికి నెలకు రూ. 30 లు స్టయిపెండు యివ్వబడుతుంది.

*ఎక్స్‌టెన్షన్ కోర్సు* :- ఇది 6 నెలలు నేర్పబడుతుంది. శిక్షణ పొందేవారు నేర్చిన వివిధ విషయాల పరిజ్ఞానాన్ని ఆచరణలో పెట్టే విషయానికి ఈ 6 నెలల్లోను ప్రాముఖ్యమివ్వబడుతుంది, గ్రామీణునితో వ్యవహరించవలసిన పద్ధతులు యీ శిక్షణలో ప్రధానాంశాలుగా వుంటాయి. వ్యక్తి, గ్రామముకూడా సర్వతోముఖమయిన అభివృద్ధి చెందడానికి మిక్కిలి ముఖ్యమయిన సాంఘిక విద్య, సహకారం, పంచాయితీలు, ప్రజారోగ్యం, కుటీర పరిశ్రమలవంటి విషయాలు కూడా బోధించబడతాయి. ఇక్కడ శిక్షణపొందిన వ్యక్తి బహుళార్థ సాధకుడయిన కార్యకర్తగా రూపొంది, గ్రామపునర్నిర్మాణములో "స్పార్కుప్లగ్"గా పనిచేస్తూ గ్రామీణునికి మిత్రుడుగా, తత్వబోధకుడుగా, మార్గదర్శిగా

వుపకరించాలని ఆశయం. శిక్షణ కాలంలో ఒక్కొక్కరికి నెలకి రూ. 50 లు స్టయిపండు యివ్వబడుతుంది.

గృహశాస్త్రం వింగ్ : కమ్యూనిటీ ప్రోగ్రాము స్త్రీ పురుష లందరికీ వుద్దేశించబడిన కార్యక్రమం. అభివృద్ధి కార్యక్రమంలో గ్రామీణ స్త్రీల సహకారాన్ని పొందడానికి ప్రత్యేక శిక్షణపొందిన స్త్రీ కార్యకర్తలు అవసరం. అందు చేత కొన్నికొన్ని విస్తరణ శిక్షణా కేంద్రాలలో గ్రామ సేవికల శిక్షణకై గృహశాస్త్రం వింగ్సు యేర్పాటు చేయ బడినవి. పెక్కు రాష్ట్రాలలో యీ విధంగా జరుపబడింది. ఈ గ్రామసేవికలు అభివృద్ధి కార్యక్రమం గురించి గ్రామీణ స్త్రీలకు వివరించి, వారి సమస్యల పరిష్కారానికి తోడ్పడుతారు.

గృహశాస్త్రం వింగ్ 4-8-55 న ప్రారంభమయింది. సంవత్సరానికి 20 మంది గ్రామసేవికలకి శిక్షణ యివ్వ బడుతుంది. శిక్షణకాలం ఒక సంవత్సరం. శిక్షణ కాలంలో నెలకి రూ. 50 లు స్టయిపండు యివ్వబడుతుంది. ఈ వింగ్ ఒక ప్రధానోపాధ్యాయిని ఆధ్వర్యం క్రింద నడు స్తున్నది. ఆమెకు యిద్దరు సహాయకు లున్నారు. ఈ వింగ్ విస్తరణ శిక్షణాకేంద్రం ఆవరణలోనున్న స్వంత భవనానికి 1-6-56 న తరలించబడింది. రెండవ జట్టు శిక్షణ 10-9-56 నుంచి ఆరంభమైనది.

ఈశిక్షణలో తరగతిలో జరిగే మామూలు బోధన, ప్రాక్టి కల్సు వుంటాయి. అపైన వారానికి 3 రోజులు గ్రామాలలో పనిచేయాలి. గ్రామాలలో పని చేసేటప్పుడు గ్రామీణ జీవితాన్ని పరిశీలించి, ప్రజల ఆహారపు అలవాట్ల లెక్కలను సేకరిస్తారు.

ఆహారం, పౌష్టికాహారం, వస్త్రధారణ, బట్టలువుతకడం, మాతాశిశు సంరక్షణ, ఆరోగ్యం, పారిశుధ్యం, చేతిపనులు, కుటీర పరిశ్రమలు, వ్యవసాయం, యింటితోట, పాడి పరిశ్రమ, కోళ్లు, తేనెటీగల పెంపకం, సహకారం, గృహ శాస్త్రం ఎక్స్టెన్షన్ వంటి విషయాలు నేర్పబడతాయి.

వర్కుషాపు సెక్షన్ :- వడ్రంగులు, కమ్మరులవంటి గ్రామాలలోని చేతిపనివారు ఆధునిక పనిముట్ల వుపయో గాన్ని ప్రత్యేకంగా నేర్చుకుని ఆధునికమైన వ్యవసాయ పరికరాలను తయారుచేయడం, మరమ్మతుచేయడం బాగా నేర్చుకోవాలి. లేకపోయినట్లయితే రైతులు అధికోత్పత్తిని సాధించలేరు. ఆవిధంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద దేశం నిర్ణయించిన వ్యవసాయోత్పత్తి లక్ష్యాలను మనం



కేంద్రం వర్కుషాపులో అభ్యర్థులు చేతిపనులశిక్షణ పొందడం.



*కేంద్రంలోని గ్రంథాలయం.*

చేరుకోలేము. కాబట్టి గ్రామాలలోని చేతిపనివారికి అవసరమైన శిక్షణ యివ్వడానికై విస్తరణ శిక్షణకేంద్రాలకు వర్కుషాపులు అనుబంధించబడినవి. వీటికి ఫోర్డు ఫౌండేషన్ నుంచి సహాయం లభిస్తుంది.

ఇక్కడ శిక్షణపొందడానికి గ్రామాలలోని చేతిపనివారి కుటుంబాలనుంచే అభ్యర్థులు యెన్నుకోబడతారు. శిక్షణ కాలం ఒక సంవత్సరం. ఒక్కొక్కజట్టులో 20 మందికి శిక్షణయివ్వబడుతుంది. శిక్షణకాలంలో నెలకి రూ. 30-0-0 స్టయిపెండు యివ్వబడుతుంది. శిక్షణపూర్తిఅయిన తరువాత తనగ్రామంలో వర్కుషాపును తెరువగలనని చేరేటప్పుడు ప్రతివ్యక్తి వ్రాసియివ్వాలి. ఈ శిక్షణ పథకాన్ని ఒక ఛీఫ్ ఇన్‌స్ట్రక్టరు నిర్వహిస్తాడు. అతనికి యిద్దరు సహాయకు లున్నారు.

ఈ శిక్షణ కార్యక్రమం ప్రధానంగా భారతదేశంలోని సామాన్య రైతు అవసరాల ప్రాతిపదికపై రూపొందించబడింది. అతని ఆర్థిక స్తోమత, స్వల్పమైన రాబడిమార్గాలు, తక్కువ విద్యాస్థాయి యివి దృష్టిలో పెట్టుకొనబడినవి. రైతుకు సామాన్యమై చవుకగా వస్తూ సమర్థంగా పనిచేసే ఆధునిక పరికరాలను అందివ్వడానికి యెక్కువప్రాధాన్యత యివ్వబడుతుంది. అవి గ్రామీణ పరిస్థితుల కనుగుణంగా వుంటాయి. ఎడ్లసహాయంతోకాని అవి అవసరంలేకుండానే కాని పనిచేయడానికి అనువుగా వుంటాయి. అయితే ఆయిలు ఇంజన్లు, ట్రాక్టర్లవంటి ఆధునిక యంత్రాల వుపయోగం, మరమ్మతు, నిర్వహణలవంటి విషయాలకుకూడా యీ శిక్షణలో స్థానమున్నది. అదిగాక మంచిరకం గ్రామీణ గృహాలు, పశువులపాకల నిర్మాణం, పొగరాని పొయ్యిల తయారీ, పాడి పరిశ్రమకు, కోళ్లు, తేనెటీగల పెంపకానికి అవసరమైన పరికరాల తయారీ మున్నగునవికూడా యిక్కడ నేర్పబడతాయి. ఈవిధంగా గ్రామీణ చేతిపనివారు రైతులకు సుశిక్షితులైన గ్రామీణ మెకానిక్కులుగా వుపకరించేవిధంగా యీ శిక్షణ కార్యక్రమం రూపొందించబడింది.

## ఓరియంటేషన్ ట్రైనింగు

అభివృద్ధి బ్లాకులలో పనిచేస్తున్న గ్రూపులెవెల్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు వారివారి సబ్జక్టులలో అర్హతపొందిన స్పెషలిస్టులు - వారికి ఎక్స్‌టెన్షన్ పద్ధతులలో పునరుజ్జీవన శిక్షణా, వారి సబ్జక్టులు కాని యితర విషయాలలో ఆచరణయోగ్యమైన పరిజ్ఞానము అవసరమనిపించింది. ఆప్రకారం గ్రూప్‌లెవెల్ కార్యకర్తలకు ఓరియెంటేషన్ ట్రైనింగు కోర్సు ప్రారంభింపబడింది.

శిక్షణ రెండు నెలలు యివ్వబడుతుంది. శిక్షణకు పంపే ప్రతి జట్టులోను 15 మంది వుంటారు. వారు వ్యవసాయ, పశుపోషణ, సహకార రంగాలనుంచి తీసుకొన్నబడతారు. ఈ పథకాన్ని ఒక వ్యవసాయవేత్త నిర్వహిస్తాడు. బోధనా కార్యక్రమానికి సంబంధించిన పనులుకాక అతడు యీ కేంద్రానికి చెందిన పొలం విషయాన్నికూడా చూస్తాడు.

గ్రూపు లెవెల్ కార్యకర్తల తొలిజట్టు శిక్షణ 13-10-55 న ఆరంభమయింది. ఇంతవరకు 7 జట్టులకు శిక్షణ యివ్వబడింది. వీటిలో 35 వ్యవసాయ, 32 పశుపోషణ, 10 సహకార, 15 పర్కు్స ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు వున్నారు.

పాఠ్య ప్రణాళికలో దిగువ విషయా లున్నాయి :

ఎక్స్‌టెన్షన్, వ్యవసాయం, మొక్కల రక్షణ, తోట పని, కూరగాయల పెంపకం, పశుపోషణ, ప్రజారోగ్యం, సాంఘిక విద్య, సహకారం, రోడ్లు. శిక్షణకాలంలో విద్యార్థులు పొలాలు చూడడానికి వెడుతూవుంటారు. అనేక ప్రదేశాలలో పరిశీలనకై పర్యటిస్తారు.

## ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల శిక్షణ

గ్రామ పంచాయితీల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు అభివృద్ధి కార్యక్రమాలలో ఓరియెంటేషన్ ట్రెయినింగును యిచ్చే యేకైక సంస్థ భారతదేశములో యీ ట్రైనింగు కేంద్ర మొక్కటే. గ్రామ పంచాయితీల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు ఎక్స్‌టెన్షన్ పద్ధతులలో శిక్షణ యివ్వడం అవసరమని 1954 లో కర్నూలులో కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమముపై జరిగిన ప్రభుత్వశాఖల అధిపతుల, ప్రభుత్వ కార్యదర్శుల సమావేశంలో నిశ్చయించబడింది. ఎగ్జిక్యూటీవ్ ఆఫీసర్లు ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య లైజాన్ ఆఫీసర్లుగా తమ పాత్రను బాగుగా గుర్తెరుగడానికి యీ శిక్షణ వుద్దేశించబడింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద అభివృద్ధి కార్యక్రమాల అమలులో వారి పాత్ర యేమిటో తెలుసుకోడానికికూడా యిది వుపకరిస్తుంది.

ఈ శిక్షణ 1-7-56 నుంచి ఆరంభమయింది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు 20 మంది గల జట్టులలో శిక్షణ యివ్వబడుతుంది. శిక్షణకాలం రెండు వారాలు. ఈ పథకం జిల్లా పంచాయితీ ఆఫీసరు ఆధ్వర్యాన నడుస్తుంది.

పాఠ్యప్రణాళికలో విస్తృతమైన రంగములో వివిధ విషయాలు చేరివున్నాయి. అయితే ప్రాముఖ్యం మాత్రం ఎక్స్‌టెన్షన్ పనికి యివ్వబడుతుంది.

*ప్రత్యేక రకాల శిక్షణ:* పైన చెప్పిన మామూలు ట్రయినింగు కోర్సులకు తోడు యీ కేంద్రంలో పెక్కు స్వల్పకాలికకోర్సు లున్నాయి.

*రిఫ్రెషర్ కోర్సులు :* వ్యవసాయ పట్టభద్రులు. గ్రామాభ్యుదయ శాఖకు చెందిన సిబ్బంది గల పెక్కు జట్టులకు రిఫ్రెషర్ కోర్సులు 1½-3 నెలలపాటు - జరుపబడతాయి.

*ప్రీ సర్వీసు ట్రయినింగు :* 1956-57 లో 3 జట్టుల గ్రామసేవికలకు, 3 జట్టుల సాంఘిక విద్యా ఆర్గనైజర్ల (స్త్రీలు)కు ప్రీ సర్వీసు ట్రయినింగు యివ్వబడింది. వారు తమ తమ పాత్రను, విధులను అర్థం చేసుకొని, సమాజాభివృద్ధిని గురించి తెలుసుకొనడానికి యీ కోర్సు యేర్పాటు చేయబడింది.

*విశ్వవిద్యాలయ విద్యార్థులకు :* కళాశాలా విద్యార్థులు, ఉపాధ్యాయులలో సాంఘిక సేవాచైతన్యాన్ని పెంపొందించి ఇండియా గ్రామ పునర్నిర్మాణ సమస్యను వారు అర్థం చేసుకోడానికి వీలుగా యీ కోర్సును కేంద్రప్రభుత్వపు విద్యా మంత్రిత్వశాఖ ప్రారంభించింది.

ఈ శిక్షణకై ఎక్స్‌టెన్షన్ ట్రయినింగు కేంద్రములో ఒక వారం, జాతీయ వికాస సేవాకేంద్రం లేక సమాజాభివృద్ధి బ్లాకులలో 5 వారా లుండాలి. 1956-57 లలో ఆంధ్ర విశ్వవిద్యాలయంనుంచి వచ్చిన 2 జట్టులకు శిక్షణ యివ్వబడింది.

*గ్రామనాయకుల శిక్షణ :* ఈ కేంద్రములో గ్రామనాయకులకు శిక్షణ అనేక శిబిరాలలో నిర్వహింపబడింది. ఈ జిల్లాలో అనేక బ్లాకులలో నిర్వహింపబడింది. కేంద్రం సిబ్బంది కూడా పాల్గొన్నది.



# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

రాష్ట్ర ప్రభుత్వ ప్రయత్నం ఫలితంగా 1957 ఆగస్టు 7 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆవిర్భవించింది. ఇది స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థ. ఇందులో రచయితలూ, కవులూ, పండితులూ అయినవారు 60 మంది సభ్యులుగా వున్నారు. రాష్ట్రపతి డా. రాజేంద్ర ప్రసాద్ అకాడమీకి ప్రారంభోత్సవం జరిపారు.

ప్రారంభోత్సవ సందర్భంలో రాష్ట్ర విద్యామంత్రి శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావుగారు ప్రసంగిస్తూ "ఈ సంస్థ ప్రారంభోత్సవంతో ప్రభుత్వానికి కొంత జోక్యం వున్నమాట నిజం. అయితే ఈ జోక్యం ప్రారంభోత్సవం వరకే. అటుతర్వాతకాదు. సాహిత్యవిషయాలలో ప్రభుత్వ ప్రమేయం అభిలషణీయంకాదని ఒకరు మాకు చెప్పనక్కర లేదు. ఆ సంగతి ప్రభుత్వ సభ్యులమైన మాకూ తెలుసు. సాహిత్యాన్ని కాని, సాహితీపరులను కాని కంట్రోలు చేయాలని ప్రభుత్వంకోరడంలేదు. అందుకోసమే ఈ అకాడమీని స్థాపించడమూ లేదు. ఈ ప్రారంభోత్సవం వరకే దీనితో ప్రభుత్వానికి సంబంధం. అటుపిమ్మట ఇది స్వతంత్రంగానే పనిచేస్తుంది. ఈ సంస్థ విభిన్న దృక్పథాలకు సమన్వయ కేంద్రమై, అట్టి సమన్వయంవల్ల జవం, జీవం, నూత్న దృక్పథంగల సాహిత్యం ఉద్భవించవలెనని మా ఆశయం. దీనికి విఘ్నేశ్వరపూజచేయడంతో మా బాధ్యత ముగిసినా, ఇకముందు దీని పురోభివృద్ధిని గురించి అసలే పట్టించుకోమని కాదు. సాహితీపరుల స్వేచ్ఛకు భంగకరం కాని విధంగా, మాకు చేతనైన సహాయం చేయడానికి మేము సర్వదా సంసిద్ధులమే" అని స్పష్టంచేశారు.

## వివిధ భాషలకు ఒకే లిపి

రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ అకాడమీకి ప్రారంభోత్సవం చేస్తూ దేశంలోని వివిధ భాషలకు ఒకే లిపిని—దేవనాగర లిపిని వినియోగించదగునని, ఇలా చేయడంవల్ల అన్నిభాషల అభివృద్ధికి అవకాశం కలుగడమేకాక ఆయా భాషలను సులభంగా నేర్చుకొనే వీలు కలుగుతుందనీ ఒక సూచన చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి తమ శుభాకాంక్షలు తెలుపుతూ అకాడమీ సభ్యులు తమ బాధ్యతలను గుర్తెరిగి ఉత్తమ సాహిత్య పరిరక్షణకు పూనుకుంటారనీ, శాశ్వతంగా పుంపిపొయ్యేటువంటి సాహిత్య సృష్టికి శ్రద్ధ గైకొంటారనీ ఆశించారు.

## అంతా ఒక తల్లి బిడ్డలమనే భావం

ఆంధ్ర ప్రదేశ్ క్రొత్త గవర్నరు శ్రీ భీమసేన్ సాచార్ పదవీ స్వీకరణం చేయడం, ఈ అకాడమీ అవతరించడం, ఈరెండూ ఒక వారంరోజుల్లోపల జరిగాయి. గవర్నరు ఈ సందర్భంలో ప్రసంగిస్తూ రచయితలు తమ రచనల మూలకంగా భారతీయులందరూ తాము ఒక తల్లి బిడ్డలమేననీ, భారతీయ సంస్కృతికి ఏకత్వం వుందనీ గ్రహించేటట్లు చేయవలెనన్నారు.

## విశాల దృక్పథం అవసరం

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు సభాసదులకు స్వాగతం చెబుతూ తెలుగు సాహిత్యం ఇరుగుపొరుగు ప్రాంతాల సాహిత్యాలలో గల మంచినంతను స్వీకరించి సుసంపన్నమైందనీ, ఇప్పుడు మనం విశాల దృష్టిని అలవరచుకొని ఇతరులనుంచి మంచి విషయాలు నేర్చుకోవడానికి సంతత సంసిద్ధతను ప్రకటిస్తూ ప్రగతికారకములైన నూతన భావాలను సంతోషంతో స్వీకరిస్తూ పాతకొత్తల మేలు కలయికకోసం పట్టుదలతో కృషిచేయాలని సాహితీపరులను ప్రబోధించారు.

## అకాడమీ నియమావళి

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీకి డా. బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులు. అకాడమీ సవరింపబడిన నియమావళి ఇది :

## 1. పేరు

ఈ అకాడమీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అను పేరుతో వ్యవహరింపబడును. (ఇకముందునుంచి ఇది ఇచ్చట అకాడమీ అని పేర్కొన బడుతుంది.)

## 2. అనుబంధం

1. ఈ అకాడమీ, జాతీయ సాహిత్య అకాడమీవారు సందర్భానుసారం నిర్ణయించు షరతులకూ, నియమాలకూ లోబడి, జాతీయ సాహిత్య అకాడమీకి అనుబంధ సంస్థగా వుండగలదు.

2. ఈ అకాడమీ 1860 సంవత్సరపు సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టంప్రకారం రిజిస్టరు చేయబడి ఒక సంస్థగా వ్యవహరించ గలదు. దీనికి స్థిరమైన ముద్ర (సీలు) వుండును. అధికార నామంతో ఇతరులపై న్యాయసంబంధమైన చర్యలు తీసికొనుటకు ఈ అకాడమీకి హక్కు వుండును. అట్లే ఇతరులు కూడా అధికార నామంతో దీని మీద న్యాయసంబంధమైన చర్యలు గైకొన వచ్చును.

## 3. ప్రధాన కార్యాలయము

అకాడమీ ప్రధాన కార్యాలయం హైద్రాబాదులో వుండ గలదు. అయితే జనరల్ కౌన్సిల్‌లోని మొత్తం సభ్యులలో నాలుగింట మూడువంతులమంది సభ్యులచే ఆమోదింప బడిన తీర్మానం ద్వారా దీని ప్రధాన కార్యాలయాన్ని మరొక చోటికి మార్చవచ్చును.

## 4. వ్యవస్థ

ఈ అకాడమీకి ఈదిగువ అధికారాలుండ గలవు. ఈ దిగువ విధులను ఇది నిర్వర్తించ గలదు :

1. తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికై సాహిత్య వేత్తలలో సహకారమును పెంపొందించడం,

(2) నేటి తెలుగుభాషకు ప్రమాణబద్ధమైన వ్యాకరణాన్ని సిద్ధంచేసే ఉద్దేశంతో మాండలికాలు, జానపద సాహిత్య పరిశీలనను ప్రోత్సహించడం;

3. గ్రంథముల పట్టికలు, నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వములు, ప్రాథమికశబ్ద సంగ్రహములు మొదలగువాటిని సిద్ధపరచి ప్రకటించే విషయంలో సంస్థలకూ, వ్యక్తులకూ తోడ్పడటం :

4. సాహిత్య సభలు, గోష్ఠులు, ప్రదర్శనములు ఏర్పాటు చేయడం;

5. విశిష్టమయిన సాహితీకృషి చేసినందుకుగాను రచయితలను వ్యక్తిగతంగా పరిగణించి, వారికి బహుమతులు, ప్రత్యేక గౌరవములు ఇవ్వడం :

6. తెలుగు భాషాసాహిత్యాలలో పరిశోధనను ప్రోత్సహించడం ;

7. ప్రజానీకంలో తెలుగుసాహిత్యాన్ని ప్రచారంచేసి వారిలో సాహిత్య పరిశీలనాసక్తిని కలిగించడం ;

8. భాషయొక్క తులనాత్మక పరిశీలనను ప్రోత్సహించడం ;

9. వైజ్ఞానిక సాధనాలద్వారా ఈ అకాడమీవంటి ఇతర సంస్థలతో సుహృద్భావసాన్నిహిత్యాలను పెంపొందింపజేయడం ;

10. భాషా సాహిత్యాల విషయంలో విశిష్టమైన కృషి చేసివుండి, పేదరికంలో పడివున్న సాహిత్యవేత్తలకు ఆర్థికసహాయం మంజూరుచేయడం ;

11. సాహితీ సంచికలను, పత్రికలను ప్రకటించడం.

12. ఒక కేంద్ర గ్రంథాలయాన్ని నెలకొల్పడం.

13. ప్రజలవద్దనుండి, వ్యక్తులవద్దనుండి, సంఘములూ సంస్థలవద్దనుండి విరాళాలు వసూలుచేయడం; ప్రభుత్వం వద్దనుండి, ప్రభుత్వం మాదిరి సంస్థలవద్దనుండి గ్రాంట్లు పొందడం ;

14. అకాడమీ నిమిత్తమై స్థలంకొనడం, అన్ని విధములైన ఆస్తిని సేకరించడం. అట్టి ఆస్తి నిర్వహణ, అమ్మకం, కుదువపెట్టడం లేదా ఇతరవిధములైన వ్యవహారాలన్నీ జరుపడం;

15. అకాడమీ లక్ష్యసాధనకై, పైన పేర్కొనబడ్డ అధికారాలకు సంబంధించినప్పటికీ లేకపోయినప్పటికీ కూడా, ఇతరవిధములైన చర్యల నన్నిటినీ గైకొడం ;

## 5. అకాడమీ అధికారులు

ఈ క్రిందివారు అకాడమీ అధికార్లుగా వుండగలరు :

1. అధ్యక్షుడు.
2. ఉపాధ్యక్షుడు.
3. కోశాధిపతి.
4. కార్యదర్శి.
5. సహాయకార్యదర్శి.

## 6. అధ్యక్షుడు :

అకాడమీ అధ్యక్షుడు జనరల్ కౌన్సిలు సభ్యులచే ఎన్నుకోబడి, మూడేండ్ల కాలం వరకు పదవిలో వుండును.

అయితే మొదటి అధ్యక్షుణ్ణి అకాడమీ సభ్యులలోనుంచి ప్రభుత్వమే నియమిస్తుంది. ఆయన మూడేండ్లపాటు పదవిలో వుండగలడు.

2. అకాడమీ అధ్యక్షుడు నామమాత్రాధిపతిగా వుండగలడు. ఆయన అకాడమీ అధికారసంస్థలన్నిటికీ,కమిటీలకూ ఎక్స్ అఫీషియో సభ్యుడుగా వుండగలడు. ఆయన జనరల్ కౌన్సిల్ సమావేశాలకూ, ఎగ్జిక్యూటివ్ బాడీ (కార్యనిర్వాహక సమితి) సమావేశాలకూ, అకాడమీ నియమావళి ననుసరించి నియమ నిబంధనల ననుసరించి ఏర్పాటు చేయబడిన ఇతర కమిటీల సమావేశాలకూ అధ్యక్షత వహించగలడు.

## 7. ఉపాధ్యక్షుడు

1. అకాడమీ ఉపాధ్యక్షుడు జనరల్ కౌన్సిల్‌చే కౌన్సిల్ సభ్యులలోనుండి ఎన్నుకోబడి మూడేండ్ల కాలంపాటు పదవిలో వుండును. అయితే మొదటి పర్యాయంమాత్రం ప్రభుత్వమే ఉపాధ్యక్షుణ్ణి నియమిస్తుంది,

2. అధ్యక్షుడు లేనప్పుడు ఉపాధ్యక్షుడు అధ్యక్షుడుగా పనిచేస్తూ అధ్యక్షుని అధికారాల నన్నిటినీ నిర్వర్తించును.

## 8. కోశాధిపతి

1. అకాడమీ కోశాధిపతిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే రాష్ట్ర ఆర్థికశాఖనుండి నియమించును. కోశాధిపతి జనరల్ కౌన్సిల్ ఎక్స్ అఫీషియో సభ్యుడుగా కూడా నామినేట్ చేయబడును.

2. (అ) అకాడమీ ఎగ్జిక్యూటివ్ బోర్డు అజమాయిషీకి లోబడి కోశాధిపతి అకాడమీ ఆస్తి పెట్టుబళ్ళ మేనేజిమెంటును నిర్వర్తించును. అంతేగాక సాలుసరి అంచెనాలను లెక్కలనూ తయారుచేసి వాటిని, ఎగ్జిక్యూటివ్‌బోర్డుకూ, జనరల్‌కౌన్సిల్‌కూ సమర్పించే బాధ్యత వహించును.

(ఆ) ఎగ్జిక్యూటివ్‌బోర్డు అధికారాలకు లోబడి కోశాధిపతి దేనినిమిత్తం ఏ డబ్బు కేటాయింపబడిందో లేదా మంజూరు చేయబడిందో ఆ పనుల నిమిత్తం ఆ డబ్బును వినియోగించే బాధ్యత వహించును.

(ఇ) అకాడమీ ముద్రకు కోశాధిపతి సంరక్షకాధికారిగా వ్యవహరించును. అకాడమీ జరిపిన అన్ని కంట్రాక్టులపైన కోశాధిపతి సీలువేసి సంతకం పెట్టును.

(ఈ) ఎగ్జిక్యూటివ్‌బోర్డు తనకు సంక్రమింపజేసిన ఇతర అధికారాలనుకూడా కోశాధిపతి నిర్వర్తించును.

3. డబ్బు తీసుకొన్నప్పుడూ, డబ్బు చెల్లించినప్పుడూ కోశాధిపతిగానీ లేక ఎగ్జిక్యూటివ్‌బోర్డు అనుమతించిన ఇతర వ్యక్తి లేక వ్యక్తులుగానీ సక్రమమైన వోచర్లు వుంచవలెను. అకాడమీకి ఇచ్చిన డబ్బుకు అట్టి రసీదులు తగు జవాబుదారీగా వుండగలవు.

## 9. కార్యదర్శి

1. అకాడమీకి కార్యదర్శి ముఖ్యమైన కార్యనిర్వహణాధికారిగా వుండును. ఈయన ఎగ్జిక్యూటివ్ బోర్డుచే బోర్డు సభ్యులలో నుండి ఎన్నుకోబడును. కార్యదర్శి ఎంతకాలం పదవిలో వుండేదీ, ఏనియమాల ప్రకారం పనిచేసేదీ ఎగ్జిక్యూటివ్‌బోర్డే నిర్ణయిస్తుంది. అయితే మొదటి కార్యదర్శిని మూడేండ్ల గడువుకు మించకుండా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమిస్తుంది. ఆయన నియామకపు షరతులను ప్రభుత్వమే వివరిస్తుంది.

2. కార్యదర్శి జనరల్ కౌన్సిల్‌కూ, ఎగ్జిక్యూటివ్ బోర్డుకూ, ఆర్థిక సంఘానికీ, జనరల్ కౌన్సిల్‌చే లేదా ఎగ్జిక్యూటివ్ బోర్డుచే ఏర్పాటు చేయబడు ఇతర స్థాయిసంఘాలకూ ఎక్స్ అఫీషియో కార్యదర్శిగా వుండును.

3. *కార్యదర్శి విధులు ఇవి :—*

(అ) అకాడమీ రికార్డులకూ, ఎగ్జిక్యూటివ్‌బోర్డు అప్పగించిన అకాడమీ ఆస్తులకూ సంరక్షణాధికారిగా వ్యవహరించడం.

(ఆ) అకాడమీ తరపున ఉత్తరప్రత్యుత్తరాలుజరిపడం.

(ఇ) అకాడమీ అధికారసంస్థల సమావేశాలు జరుగునప్పుడు, అకాడమీ నియమించిన కమిటీల సమావేశాలు జరుగునప్పుడూ నోటీసులు జారీచేయడం.

(ఈ) అకాడమీ అధికారసంస్థల సమావేశాల వ్యవహారసరళిని, అకాడమీ నియమించిన కమిటీల సమావేశాల వ్యవహార సరళిని వ్రాసివుంచడం.

## 10. సహాయకార్యదర్శి

1. అకాడమీ సహాయకార్యదర్శి ఎగ్జిక్యూటివ్ బోర్డుచే ఆ బోర్డులోని సభ్యులలోనుండి ఎన్నుకోబడి, మూడేండ్లపాటు పదవిలో వుండును.

అయితే మొదటి సహాయకార్యదర్శిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మూడేండ్లకాలానికి మించకుండా నియమిస్తుంది. ఆయన నియామకపు షరతులను ప్రభుత్వం వివరిస్తుంది.

2. సహాయ కార్యదర్శి కార్యదర్శికి విధినిర్వహణలో తోడ్పడుతూ, కార్యదర్శి లేనపుడు కార్యదర్శిగా వ్యవహరించును.

## 11. అకాడమీ అధికార సంస్థలు

అకాడమీ అధికార సంస్థలు ఇవి :

1. జనరల్ కౌన్సిల్
2. ఎగ్జిక్యూటివ్ బోర్డు
3. ఆర్థిక సంఘం
4. సందర్భానుసారంగా ఏవేని విధులను నిర్వహించడానికై జనరల్ కౌన్సిల్‌చేగాని లేదా ఎగ్జిక్యూటివ్ బోర్డుచేగాని నియమింపబడు స్థాయిసంఘాలు లేదా అడ్‌హాక్ కమిటీలు.

## 12. జనరల్ కౌన్సిల్

జనరల్ కౌన్సిల్ ఈ క్రిందివారితో ఏర్పాటగును.

1. 5వ పేరాలో పేర్కొనబడిన అధికార్లు ఎక్స్ అఫీషియో సభ్యులుగా వుందురు.

2. ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఇద్దరు వ్యక్తులు. వీరిలో ఒకరు ఆర్థికశాఖనుండి, ఇంకొకరు విద్యాశాఖనుండి నామినేటు చేయబడుతారు. ఆర్థికశాఖనుండి నామినేటు చేయబడినవారు కోశాధిపతిగా వ్యవహరిస్తారు.

3. సాహిత్యరంగంలో ప్రముఖులైన 22 మంది వ్యక్తులను వారి వ్యక్తిగత హోదాలోనే ప్రభుత్వం నామినేటు చేస్తుంది. వారిలో ఇద్దరు స్త్రీ లుంటారు.

4. రాష్ట్రంలోని సాహిత్య సంస్థలలో అకాడమీ పరిగణించినట్టి సంస్థలచే ఎన్నుకోబడిన 24 మంది సభ్యులు. అయితే మొదటి పర్యాయంమాత్రం వీరిని ప్రభుత్వమే నామినేటు చేస్తుంది.

5. రాష్ట్రంలో గల మూడు విశ్వవిద్యాలయాలలో ఒక్కొక్క దానినుంచి ఆయా విశ్వవిద్యాలయాధికారులచే నామినేటు చేయబడిన ఇద్దరు ప్రతినిధులు. అయితే మొదటి పర్యాయంమాత్రం ప్రభుత్వమే వీరిని నామినేటు చేస్తుంది.

6. సంగీత నాటక అకాడమీనుండి ఇద్దరు ప్రతినిధులు, లలితకళా అకాడమీనుండి ఇద్దరు ప్రతినిధులు.

7. రాష్ట్రంలోని ఇతర భాషల ప్రతినిధులుగా ఇద్దరు వ్యక్తులు నామినేటు చేయబడుదురు.

8. జనరల్ కౌన్సిల్‌చే కోఆప్టు చేసుకోబడు ఒకవ్యక్తి.

2. (1) జనరల్ కౌన్సిల్ సభ్యులందరూ వారు నామినేటు చేబడుదునప్పుడు లేదా ఎన్నుకోబడునప్పుడు 25 సంవత్సరములు నిండిన వయస్సుగలవారై ఉండవలెను.

(2) ప్రభుత్వంచే నామినేటు చేయబడిన ఒక సభ్యుడు రాజీనామా ఇచ్చినా, లేదా మరణించినా లేదా న్యాయ సంబంధమైన అనర్హత పొందినా అట్టి ఖాళీలో ప్రభుత్వం మరొకరిని నామినేటు చేస్తుంది. ఆవిధంగా నామినేటు చేయబడ్డవారు లేదా కోఆప్టు చేయబడ్డవారు పూర్వపు సభ్యుడు ఆపదవిలో వుండుటకు ఎంత గడువు మిగిలివున్నదో ఆగడువు వరకు మాత్రమే పదవిలో వుంటారు.

(3) నిర్దేశించబడిన సందర్భాలలో తప్ప లేకపోతే జనరల్ కౌన్సిల్ సభ్యులంతా మూడేండ్లపాటు పదవిలో వుందురు. తిరిగి నియమింపబడే అర్హత కూడా వారికుండును.

## 13. జనరల్ కౌన్సిల్ విధులు

జనరల్ కౌన్సిలు అధికారాలు, విధులు ఇవి :

1. తన సభ్యులలోనుండి అధ్యక్షుణ్ణి ఎన్నుకొనడం ;

2. 15 (5) పేరా ననుసరించి ఎగ్జిక్యూటివ్‌బోర్డు సభ్యులను ఎన్నుకోవడం, ఎగ్జిక్యూటివ్‌బోర్డు వ్యవహార నియమావళిని నిర్ణయించడం.

3. 17 (3) పేరా ననుసరించి ఆర్థికసంఘ సభ్యులను ఎన్నుకోవడం, ఆర్థికసంఘం యొక్క వ్యవహార నియమావళిని నిర్ణయించడం.

4. ఎగ్జిక్యూటివ్‌బోర్డు తయారుచేసిన అకాడమీ సాలుసరి బడ్జెటును ఆమోదించడం ;

5. కౌన్సిల్ సమావేశానికి హాజరైనసభ్యులలో కనీసం నాలుగింట మూడువంతుల మెజార్టీ వోటింగుతో సాహిత్యరంగంలో ప్రతిభావిశేషములు గల రచయితలను అకాడమీ సభ్యులు (ఫెలో) గా ఎన్నుకోవడం. అయితే అలా ఎన్నుకోబడువారు ఎగ్జిక్యూటివ్‌బోర్డుచే సిఫార్సు చేయబడినవారై వుండవలెను.

6. అకాడమీనుండి సహాయంపొందడానికీ, నియమావళిలో ప్రస్తావించబడిన ఇతర ఉద్దేశముల నిమిత్తమై రాష్ట్రంలోని ముఖ్యమైన సాహితీసంస్థలను ఎన్నికచేయడం; అలా ఎన్నిక చేయబడిన సంస్థలను ప్రభుత్వం పరిగణించవలసి వుంటుంది.

7. ఎగ్జిక్యూటివ్‌బోర్డు ప్రతిపాదించిన కార్యక్రమాలకూ, ప్రత్యేక పనులకూ ఆమోదం తెలుపడం.

8. తన నియమావళినీ, నిబంధనలనూ, ఉపనియమాలనూ, వ్యవహార నియమాలనూ సిద్ధపరచడం.

## 14. జనరల్ కౌన్సిల్ సమావేశాలు

అధ్యక్షుడు నిర్ణయించిన స్థలంలో, ఆయన నిర్ణయించిన తేదీనాడు జనరల్ కౌన్సిల్ సాధారణంగా ప్రతిసంవత్సరం ఒక పర్యాయం సమావేశమగును. అయితే అధ్యక్షుడుగాని లేక ఎగ్జిక్యూటివ్‌బోర్డుగాని ఎప్పుడైనా ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేయవచ్చు. అలాంటి సమావేశం బోర్డు స్వయంగా చొరవతీసుకొనిగాని లేదా జనరల్ కౌన్సిల్‌లోని మొత్తంసభ్యులలో మూడింట రెండు వంతులమందికి తక్కువగాని సభ్యులకోర్కెపైగాని ఏర్పాటు చేయవచ్చు.

## 15. ఎగ్జిక్యూటివ్ బోర్డు

ఎగ్జిక్యూటివ్‌బోర్డు ఈ దిగువ సభ్యులతో ఏర్పడును.

1. అధ్యక్షుడు.
2. ఉపాధ్యక్షుడు.
3. కోశాధిపతి.
4. కార్యదర్శి.
5. సహాయకార్యదర్శి.
6. జనరల్ కౌన్సిల్‌చే ఎన్నుకోబడు తొమ్మిదిమంది సభ్యులు. అయితే మొదటిపర్యాయం వీరిని ప్రభుత్వమే నామినేటు చేస్తుంది.

## 16. ఎగ్జిక్యూటివ్ బోర్డు విధులు

ఎగ్జిక్యూటివ్‌బోర్డు అధికారాలు, విధులు ఇవి :

1. జనరల్ కౌన్సిల్ సూచించిన విధానాలకు లోబడి అకాడమీయొక్క కార్యనిర్వహణ బాధ్యత వహించడం.

2. అకాడమీ పనిని, కార్యాలయాన్నీ పర్యవేక్షించి అజమాయిషీ చేయడం.

3. అకాడమీ కార్యక్రమాలను, ప్రత్యేకంగా చేయవలసిన పనుల కార్యక్రమాలను పరిశీలించి సిద్ధంచేసి జనరల్ కౌన్సిలుకు సమర్పించడం.

4. ఆర్థికసంఘం నిర్ణయించిన పరిమితులకు లోబడి అకాడమీ సాలుసరి బడ్జెటును తయారుచేసి జనరల్ కౌన్సిల్ ఆమోదం నిమిత్తం సమర్పించడం.

5. అకాడమీ వార్షిక నివేదికను, లెక్కలను తయారుచేసి జనరల్ కౌన్సిల్ పరిశీలన నిమిత్తం పంపడం.

6. అకాడమీ కార్యదర్శినీ, సహాయ కార్యదర్శినీ, సిబ్బందిలోని ఇతర సభ్యులనూ ఎన్నుకోవడం. అయితే సిబ్బందిలో ఎవరిని నియమించే అధికారం కార్యదర్శికి ఇవ్వబడిందో అట్టివారిని బోర్డు ఎన్నుకోవడానికి వీలులేదు.

7. వ్యక్తులనుండి, సంఘములనుండి, ప్రజా సంస్థలనుండి విరాళాలు సేకరించడం.

8. నియమావళి అమలు నిమిత్తమై నియమాలను, నిబంధనలను చేయడం.

## 17. ఆర్థిక సంఘం

ఆర్థికసంఘం ఈ క్రిందివారితో ఏర్పడును.

1. కోశాధిపతి. ఈయన సంఘం అధ్యక్షుడుగా వ్యవహరించును.

2. జనరల్ కౌన్సిల్ సభ్యులలోనుంచి రాష్ట్ర ప్రభుత్వం నియమించు ఒక ప్రతినిధి.

3. జనరల్ కౌన్సిల్ ప్రతినిధి ఒకరు.

4. ఎగ్జిక్యూటివ్ బోర్డు ప్రతినిధి ఒకరు. ఈయన జనరల్ కౌన్సిల్ సభ్యుడే కానక్కరలేదు. అయితే మొదటి పర్యాయం సభ్యులందరూ ప్రభుత్వంచే నామినేటు చేయబడుదురు.

## 18. ఆర్థికసంఘం విధులు

ఆర్థికసంఘం అకాడమీయొక్క బడ్జెట్ అంచెనాలను పరిశీలించి, వాటి విషయమై ఎగ్జిక్యూటివ్‌బోర్డుకు సిఫార్సులుచేసి, ఒక ఆర్థిక సంవత్సరంలో ఖర్చుపెట్టవలసిన మొత్తం పరిమితిని నిర్ణయించును.

## 19. ఇతర విషయాలు

1. అకాడమీయొక్క ఏదేని అధికారసంస్థ ఈ నియమావళిలో నిర్వచింపబడిన దాని అధికారాలూ విధుల ప్రకారం వ్యవహరిస్తే తప్ప లేకపోతే జనరల్ కౌన్సిల్ గాని లేక ఏదేని అకాడమీ అధికార సంస్థగాని చేసిన ఏదేని నియమమును లేక నిర్ణయమును జనరల్ కౌన్సిల్ సవరించవచ్చును లేదా త్రోసిపుచ్చవచ్చును.

2. ఈ నియమావళిని జనరల్ కౌన్సిలు, కౌన్సిల్ సమావేశానికి హాజరైన మొత్తం సభ్యులలో నాలుగింట మూడు వంతుల మంది మెజార్టీ వోటుతో జనరల్ కౌన్సిల్ నిర్ణయించినవిధంగా సవరించవచ్చును.

## 20. అకాడమీ లెక్కలను ప్రతియేటా ఆడిట్ చేయడానికై ప్రభుత్వం ఆడిటర్లను నియమించును.

# హైదరాబాదులో కొత్త పాలిటెక్నిక్

హైద్రాబాదులో కొత్తగా ఒక పాలిటెక్నిక్ స్థాపించబడింది. దీనికి రాష్ట్రపతి డా. రాంజేంద్ర ప్రసాద్ 1957 ఆగస్టు 6వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు.

ఆ సందర్భంలో డా. రాజేంద్రప్రసాద్ ప్రసంగిస్తూ దేశ ప్రస్తుత అవసరాలు తీరవలెనంటే ఇప్పుడు అమలులోవున్న విద్యావిధానంలో మార్పు రావాలన్నారు. సాంకేతికవిద్య ఆవశ్యకతను నొక్కిచెబుతూ అనతికాలంలోనే భారతదేశం తనకు కావలసిన సరుకులను తానే ఉత్పత్తి చేసుకోగలదనీ, విదేశాలనుంచి దిగుమతులు చేసుకోవలసిన అవసరం అప్పుడు వుండబోదన్న ఆశాభావం రాష్ట్రపతి వెల్లడించారు.

ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రసంగిస్తూ ఈ పాలిటెక్నిక్ స్థాపనకు విరాళమిచ్చి కృషిచేసిన శ్రీ అక్బరలీఖాన్ యం. పి. గారి వితరణశీలాన్ని ప్రశంసించారు. దినదినమూ విస్తృతమైపోతున్న ప్రణాళికకు అవసరమయ్యే సాంకేతిక సిబ్బందిని ఒక్క ప్రభుత్వం మాత్రమే సమకూర్చజాలదని అంటూ, ఇటువంటి సాంకేతికసంస్థల స్థాపనకు ప్రజలు ఉదారంగా విరాళాలివ్వవలెనని విజ్ఞప్తి చేశారు.

ఈ పాలిటెక్నిక్ భారతప్రభుత్వం ఆమోదించిన విధానంప్రకారం పనిచేస్తుంది. దీనికి అనావృత్త వ్యయం రూ. 15 లక్షలు కాగలదనీ, సాలీనా రూ. 1,60,000-ల ఆవృత్తవ్యయం కాగలదనీ అంచెనా వేయబడింది. అనావృత్త వ్యయానికిగాను భారతప్రభుత్వం రూ. 7½ లక్షలు మంజూరుచేస్తుంది.

[తరువాయి 52 వ పేజీలో]



*హైదరాబాదు నగరంలోని షాహగంజ్‌లోవున్న ఖుర్షీద్ జాహి బారాదరీ భవనం ముందరిదృశ్యం. ఈ భవనంలోనే పాలిటెక్నిక్ నెలకొల్పబడింది. ఇందులో సివిల్ మెకానికల్ ఎలక్ట్రికల్ ఇంజనీరింగు కోర్సులలో మూడేళ్ళ డిప్లొమా కోర్సులు బోధింపబడుతాయి.*

# ఆంధ్రప్రదేశ్ రైతులు

[ గతసంచిక తరువాయి ]

శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఏ. యస్.
(వ్యవసాయశాఖ డైరెక్టరు)

*గత సంచికలో ప్రచురితమైన వ్యాసంలో వ్యాసరచయిత ఆంధ్రప్రదేశ్ నైసర్గిక పరిస్థితిని, భూములను, శీతోష్ణస్థితిని, వర్షపాతమును, పైరుపంటలను వివరించారు. ఈ వ్యాసంలో రాష్ట్రంలో వ్యవసాయం చేయు కులములవారి సాంఘిక ఆర్థిక పరిస్థితులను విశదీకరించారు.*

ఆంధ్ర ప్రదేశ్‌లో ఈ క్రింది కులాలవారు వ్యవసాయం ప్రధాన వృత్తిగా కలిగివున్నవారు: రెడ్డి, కాపు, కమ్మ, వెలమ, రాజులు, గవరలు, గొల్లలు. వీరుగాక ఏజన్సీ ప్రాంతాలలో నివసించే మోకదార్లు భగటులు, రాణాలు, పరోజలు, జాతబులు, కొండ దొరలు, కుమ్మర్లు, కోయలు, చెంచులు మొదలగు కొండజాతులవారు కూడా వ్యవసాయ వృత్తిగల వారే. బ్రాహ్మణ, చాకలి, కోలి, కుమ్మర, కురమ, మాల, మాదిగ, మంగలి, ముతరాసు, పెరికలు, తెలంగాణా ప్రాంతంలోని ఉప్పరవారు కూడా గ్రామనిత్య జీవితంలోని ముఖ్యమైన తమతమ సాంప్రదాయక వృత్తులతోపాటుగా వ్యవసాయం కూడా ఉపవృత్తిగా కలిగివున్నారు. వ్యవసాయ కూలీలు హెచ్చుగా మాల, మాదిగ, ఇతర నిమ్న జాతులు, కొండజాతులు, ఏనాది, లంబాడీ, ఉప్పర కులాలకు చెందినవారే.

వ్యవసాయం వృత్తిగాగల ముఖ్యమైన కులాల వారి వివరాలు ఈ దిగువ తెలుపబడినవి:

1. రెడ్లు: వ్యవసాయం చేసేవారిలో రెడ్లు అధిక సంఖ్యాకులు. వీరిలో అనేక తెగలవారున్నారు. పలనాటి రెడ్లు, దేసూరు రెడ్లు, పెడకంటి రెడ్లు, మోటాటి రెడ్లు, వెలనాటి రెడ్లు, నారాటి రెడ్లు, గూడాటి రెడ్లు, సిట్టపు రెడ్లు, పెల్లెరెడ్లు, ఓరుగంటి రెడ్లు, పాకనాటి రెడ్లు - వీరు ముఖ్యమైన తెగల వారు. రెడ్లు చక్కగా వ్యవసాయం చేయగలవారు. దేశభక్తి గలవారు. కొండవీడు, రాజమండ్రి, కోరుకొండ రెడ్లు చరిత్రలో వాసికెక్కిన వారు. వీరిలో పురుషులేగాక స్త్రీలుకూడా ధైర్యసాహసాలు గలవారని చరిత్రలో పలు సందర్భములందు చెప్పబడివున్నది. వీరి ధైర్య సాహసాలనుగూర్చి వదాన్యతనుగూర్చి, ఉదార గుణములనుగూర్చి అనేక బుర్ర కథలు పాటలు వ్రాయబడినవి. వీరిలో సాధారణంగా భూస్వాములున్నారు. వంశ పరంపరగా గ్రామోద్యోగ పదవులను నిర్వహిస్తూ వున్నవారూ వున్నారు. ఇటీవల వీరు ఉన్నతవిద్య కూడా అభ్యసించి ప్రభుత్వోద్యోగాలు, వైద్యం, విద్య, న్యాయవాద, ఇంజనీరింగు వృత్తులనుకూడా అవలంబిస్తున్నారు. వీరిలో రాజకీయ చైతన్యంకూడా గలిగింది. రాష్ట్ర ప్రజాహిత జీవితంలో రెడ్లు ముఖ్యమైన పాత్ర వహిస్తున్నారు.

2. కాపులు: బలిజ, తెలగ, మున్నూరు కాపులు లేక కాపులుకూడా వ్యవసాయ వృత్తికలవారే. వీరు తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోను, కృష్ణా జిల్లాలోను ఎక్కువగా వున్నారు. రాయలసీమ ప్రాంతంలోను, తెలంగాణాలోని మెదకు, హైదరాబాదు, నిజామాబాదు జిల్లాలలోకూడా వున్నారు.

వీరుకూడా చక్కగా వ్యవసాయం చేయగలవారే. వీరిలో కొందరు తూర్పు, పశ్చిమ గోదావరులు కృష్ణా జిల్లాలలో గ్రామ పెద్దలుగా చిరకాలంనుంచి వ్యవహారిస్తున్నారు. ఇటీవల వీరు ఉన్నత విద్యాభ్యాసంచేసి ప్రభుత్వోద్యోగాలలోను, వైద్య న్యాయవాద ఇంజనీరింగు వృత్తులలోను చేరుతున్నారు. వీరు దృఢకాయులు, స్ఫురద్రూపులు. తమ భూములను కనిపెట్టుకొని వుంటూవుంటారు.

3. కమ్మ : కమ్మవారు ఎక్కువగా ఆంధ్రప్రాంతంలోని కృష్ణా గుంటూరు జిల్లాలలో వున్నారు. అత్యుత్తమంగా వ్యవసాయం చేయగల వారిలో వీరు ప్రధానంగా చెప్పుకోదగిన వారు. వీరు తాము నివసించు ప్రాంతాలలో బాగా కృషిచేసి, చక్కని పంటలు పండించి ఆయా ప్రాంతాలను సస్యశ్యామలం చేశారు. ఆధునిక పద్ధతుల ప్రకారం వ్యవసాయంచేసి ఆదాయం వృద్ధి చేసుకొనడం ద్వారానూ పొదుపరితనంవల్లనూ వీరు సాధారణంగా సిరిసంపదలు గలవారైరి. వీరిలో స్త్రీలకు మంచి గౌరవ ప్రతిపత్తులు కలవు.

4. వెలమలు : వెలమలు భూస్వాములు. వీరు కూడా వ్యవసాయవృత్తి గలవారే. వీరిలో చాలా మంది వ్యాపారం చేస్తారు. ప్రత్తివ్యాపారం, అద్దకపుపనీ, నేతపనికూడా చేసేవారున్నారు. వెలమలలో ఐదారు తెగలున్నవి. ఆ తెగలలో పెద్దలేక పద్మ వెలమ, కమ్మవెలమ, కొప్పుల వెలమలు ముఖ్యమైనవారు. వీరు ఎక్కువగా ఆంధ్ర ప్రాంతంలోని విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలోను, తెలంగాణాలో కరీంనగరు, నిజామాబాదు జిల్లాలలోను నివసిస్తున్నారు.

5. రాజులు : సాంఘికంగా రాజులకు ఉన్నతమైన స్థానంవుంది. వీరు క్షత్రియులు. జంధ్యం వేసుకుంటారు. వీరి గోత్రాలుకూడా బ్రాహ్మణ గోత్రాలే. వీరు సూర్య, చంద్ర మాదివంశములుగా విభజింపబడి వున్నారు. వీరు దృఢకాయులు, స్ఫురద్రూపులు, గౌరవ మర్యాదలకు వీరు ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. ఇతరులక్రింద నౌకరీ చెయ్యరు. నిలకడగా వ్యవసాయం చేస్తారు. వీరు ఎక్కువగా విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలో వున్నారు. వీరి పూర్వీకులు విజయనగర రాజులవద్ద సేనానులుగానూ, దండనాయకులుగానూ పనిచేశారు. వీరిలో కొంతమంది పెద్ద భూస్వాములున్నారు. మరి కొందరు వ్యాపారం కూడా చేస్తున్నారు.

6. గవరలు : వీరుకూడా వ్యవసాయవృత్తి గలవారే. వీరు హెచ్చుగా విశాఖపట్నం జిల్లాలో వున్నారు. వీరు పూర్వం వ్యాపారం చేసేవారు. కాని ఇప్పుడు మంచి వ్యవసాయదారులుగా పేరు పడ్డారు. వీరు మనుష్యులు సగటు ప్రమాణంగా వుంటారు. వీరూ దృఢకాయులే. కష్టించి పనిచేయడంలో సహనం గలవారు. కుటుంబంలో వుండే వారంతా స్వంత వ్యవసాయపు పనులు చేసుకుంటారు. సాధారణంగా వ్యవసాయ కూలీలను పెట్టుకోరు. తోటల పెంపకపు పనిలో వీరు మంచి ప్రవీణులు. మిక్కిలి తెలివితేటలతో వ్యవసాయం చేసే నేర్పుగలవారు.

7. గొల్లలు : వీరు గొర్రెలను, మేకలను పెంచుతారు. గొల్ల అనేమాట సంస్కృతభాషలోని "గోపాల" అనే పదంనుంచి వచ్చింది. వీరిలో ఎర్రగొల్ల, గువ్వగొల్ల, పునిగొల్ల, మేకగొల్ల, గంగెద్దు గొల్ల అని ఐదుతెగలవారున్నారు. చివరి మూడు తెగలవారు ఎక్కువమంది వున్నారు. వీరు వ్యవసాయ కూలీపనికూడా చేస్తూ వుంటారు వీరు వంశ పారంపర్యంగా గొర్రెలమందలను పశువులను మేపుతూ, పాలుఅమ్మే వృత్తిగలవారు. వీరిలో చాలామంది భూములుకూడా సంపాదించి వ్యవసాయం చేసుకొంటున్నారు.

8. ఏనాది : ఏనాదుల పుట్టుపూర్వోత్తరాలు అంతగా తెలియవు. వీరిలో కొండజాతులవారి సంప్రదాయాలు కన్పించవు. వీరి పూర్వోత్తరాలను తెలుసుకోవాలంటే వీరి మతంవల్ల, భాషవల్ల ఏమీ తెలియవు. పురుషులు నలుపుగా. సన్నగా ఎత్తుగా వుంటారు. వీరి కండరాలు మెత్తగా వుంటాయి. వీరి దవడఎముకలు. గడ్డము స్ఫుటంగా కన్పిస్తూవుంటాయి. మీసాలు దట్టంగా వుండవు. ఏనాదులు వేటలో ఆరితేరినవారు. చిరుతపులులను, కుందేళ్ళను, ఎలుకలను వేటాడి పట్టుకుంటారు. నిర్భయంగా త్రాచుపాములను పట్టుకుంటారు.

9. మాల, మాదిగ :- ఆంధ్రలో నిమ్నజాతుల వారిలో మాల మాదిగలు (హరిజనులు) ముఖ్యులు.

వ్యవసాయ కూలీలలో తరచు వీరే ఎక్కువ మంది వుంటారు. చిరకాలంనుంచి వీరు అనేక అనర్హతలకు లోనై ఇబ్బందులు పడుతూ వుండిరి. ఇప్పుడు వీరి ఉన్నత విద్యాభ్యాసం కొరకు స్కాలర్‌షిపులిచ్చి, వసతి గృహాలు ఏర్పాటుచేసి, ప్రభుత్వోద్యోగంలో చేరడానికి కొన్ని రాయితీలిచ్చి వీరికి అన్ని విధాలా ప్రోత్సాహ మివ్వబడుతున్నది.

10. **లంబాడీలు :-** వీరిని సుగాలీలని కూడా అంటారు. వీరు ఎక్కువగా రాయలసీమలోను, తెలంగాణా ప్రాంతంలోని వరంగలు, మహబూబు నగర్ జిల్లాలలోను వున్నారు. వీరు అడవులలో కట్టెలు ఏరుకొని, ఇతర పంటలను సేకరించి వాటిని దగ్గిరలోవున్న బస్తీలలో అమ్ముకొని జీవనోపాధి సంపాదించు కుంటారు. పూర్వం వీరు వ్యాపార సరుకులను ఎద్దులపైన ఒకచోటినుంచి మరొక చోటికి చేరవేసి, ఆవిధంగా వ్యాపారంచేస్తూ సంపాదించుకొనే వారట. కాని ఆ వ్యాపారం పోయింది గనుక ఇప్పుడు వీరు వ్యవసాయం చేస్తున్నారు.

11. **కొండజాతుల వారు:-** ఆంధ్రలో ఏజన్సీప్రాంతం లోని ప్రజలు ఆదిమవాసులు. వీరిలోకూడా కొన్ని తెగలున్నవి. ఓఢ్రులు కొండజాతుల భాషలను త్రోసి పుచ్చారు. ఓఢ్రులు కానివారు కూడా ఒరియా భాష మాట్లాడుతున్నారు. ఏజన్సీ ప్రాంతంలోని మోకదొరలను ఒక ప్రత్యేక కులంగా విభజించవచ్చు. భగతులు, రాణాలుకూడా ఈ ప్రాంతంలోనే వున్నారు. వీరు దేశ దిమ్మర్లు. వీరు ఒరియా భాష మాట్లాడుతారు. జందెంవేసుకుంటారు. మళ్ళీ జాతపులు, జాతపుదొరలు ప్రత్యేక వర్గానికి చెందినవారు. ఒరియాభాష మాట్లాడేవారిలో పరోజలు చాలా మంది వున్నారు. పరోజలలో ఏడు తెగలవారున్నారు. వీరిలో కొంతమంది గొడ్డు మాంసం తింటారు. గడబలు పల్లకీ బోయలు వ్యవసాయంకూడా చేస్తారు. సవరలలో రెండు తెగలున్నవి. ఒక తెగవారు ఒరిస్సాలోని గుణుపురం కొండలలో నివసిస్తున్నారు. రెండవ తెగవారు కొంచెం నాగరికత గలవారు. వీరు శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ ప్రాంతంలో వున్నారు.

12. **కోయలు :** కోయలు బస్తర్ ప్రాంతంనుంచి వలస వచ్చిన వారని చెప్పబడుతున్నది. తెలంగాణా ప్రాంతంలోని అదిలాబాదు, కరీంనగరు, వరంగలు జిల్లాలలోను, ఆంధ్రలోని తూర్పుగోదావరి జిల్లాలోను వీరు ఎక్కువగా వున్నారు. వీరు సాధారణంగా ఒకచోట నిలకడగా వ్యవసాయం చెయ్యరు. పొలం మారుస్తూ వుంటారు. వీరిలో లింగధార్లు గూనులు అని రెండు తెగలున్నవి. తూర్పు గోదావరి జిల్లా కోయలు దృఢకాయులు. వారి శరీరంపై వెండ్రుకలుండవు.

13. **గోండులు :** వీరు ఆదిలాబాదు, కరీంనగరు వరంగలు జిల్లాలలో వున్నారు. వీరి మాతృభాష గోండీ. వీరి ముఖం విశాలంగా, సమతలంగా వుంటుంది. దవడ ఎముకలు స్ఫుటంగా కన్పిస్తూ వుంటాయి. ముక్కు పొట్టిగా వుంటుంది. గడ్డం పొడుచుకొని వచ్చినట్టు వుంటుంది. మనుషులు అంత ఎత్తుగా, అంత పొట్టిగా లేక మధ్యరకంగా వుంటారు. మనుషులు చామనచాయగా కొద్ది నలుపులో వుంటారు.

14. **చెంచులు :** వీరు ఎక్కువగా కర్నూలు జిల్లాలోవున్నారు. వీరు అడవులనుంచి తేనె, పండ్లు, దుంపలు, గడ్డలు సేకరించి జీవిస్తూ వుంటారు.

## జీవిత స్థితిగతులు

వ్యవసాయం చేసే కులాలవారంతా గ్రామాలలో నివసిస్తారు. గ్రామాలు సాధారణంగా చిన్నగా వుంటవి. ఒక్కొక్క గ్రామంలో ఒకటో రెండో బజార్లు వుంటాయి. కొన్ని గ్రామాలకు శివార్లు కూడా వుంటాయి. మాలమాదిగలు ప్రత్యేకంగా ఊరి బైట గూడెములలో వుంటారు. ఇండ్లు సాధారణంగా మట్టిగోడలతో, గడ్డికప్పుతో నిర్మింప బడుతవి. గాలీ వెలుతురూ రావడానికి కిటికీలు అట్టే వుండవు. గోడలకు సున్నంవేస్తారు. లేదా ఎర్ర మన్నుతో అలికి చక్కగా ముగ్గులు చుక్కలతో అలంకరిస్తారు. ఈ అలంకరణ ఏడాది కొకమారు లేక రెండుమార్లు పండుగలముందు చేస్తారు. రాయలసీమ జిల్లాలలో కడపరాయి లభించేచోట్ల ఇండ్లు మరొకతీరుగా వుంటవి. ప్రత్తిచెట్టు కొమ్మలను బందేరి అకులను ఇతరకొమ్మలను పరచి దానిపై వాననీరు కారకుండా అడుగుమందం మట్టివేస్తారు. వర్షాకాలంలో కురవకుండా చేయడానికై మట్టి

కప్పుపై చవుడుకూడా వేస్తారు. ఈ పైకప్పులకు గవాక్షాలుంటాయి. వాటిగుండా ఇంటిలోపలికి గాలి, వెలుతురు వస్తాయి. ఇండ్లలోపల రాతితో గరిసెలు, గాదెలు కట్టుతారు. వాటిలో ధాన్యం నిలువచేసుకుంటారు. మనుషులుండే గదికి ఎదురుగా వంటఇల్లూ, పూజాగృహమూ వుంటాయి. ఇంట్లో శుభకార్యాల సందర్భంలో ద్వారబంధాలకు మామిడి తోరణాలు కడతారు. వర్షాకాలంతప్ప ఇతర కాలాలలో పశువులను ఆరుబైట కట్టేస్తారు. వర్షాకాలంలో కొట్టంలో కట్టేస్తారు. పేదవారైతే తమతోపాటు ఇండ్లలోనే పశువులను కట్టేసుకుంటారు. కొంచెం కలవారైతే వారి ఇంటివెనుక పశువులకు ప్రత్యేకంగా దొడ్డి వుంటుంది.

తెలంగాణాలో చాలామంది రైతులు పూరిళ్లలో నివసిస్తారు. ఆ ఇండ్లలో నేలను పేడతో, లేదా ఎర్ర మన్నుతో లేక ఈ రెంటిని కలిపి అలుకుతారు. ధనికులు భవంతులలో నివసిస్తారు. నేలపై అందంగా ముగ్గులు పెడతారు. అయితే జీవన స్థితిగతులు క్రమేణా బాగుపడుతున్నకొద్దీ ఇటుక, సున్నం సిమెంటు పెట్టి ఇళ్ళు కట్టుకుంటున్నారు. రెడ్లు, కమ్మలు, కాపులు, రాజులఇళ్ళు సాధారణంగా పెద్దగా వుండి గ్రామంలో ప్రముఖంగా కనిపిస్తాయి. శ్రీమంతుల ఇండ్లలో స్త్రీలకు ప్రత్యేకంగా గదులుంటాయి. కాని మధ్యతరగతి వారిండ్లలో పేదల ఇళ్ళలో అటువంటివి వుండవు. ఇండ్లలో కొయ్యసామగ్రి వుండదు. మంచాలు, చాపలు వుంటాయి. స్థితిమంతుల ఇండ్లలో కుర్చీలు, బెంచీలు, ట్రంకు పెట్టెలు వుంటాయి. సాధారణంగా గ్రామవాసులు మట్టిపాత్రలనే వాడతారు. కలిగినవారు రాగి వెండి, ఇత్తడి పాత్రలు ఉపయోగిస్తారు. ఇటీవల స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలుకూడా వాడకంలోకి వస్తున్నవి.

### కుటుంబ, సంఘ సంప్రదాయాలు

కొండజాతుల వారిలో, మాల మాదిగల్లో తప్ప వ్యవసాయం చేసేఇతర కులాలవారిలో సంప్రదాయాలన్నీ ఒకేవిధంగా వుంటవి. కారణమేమంటే అంతా హిందువులేకదా! వీరంతా హిందూ సంప్రదాయాలను, ఆచారాలను పాటిస్తారు. రైతులలోనే అనేక వర్ణములవారుంటారు. వర్ణాంతర వివాహాలు వుండవు. ఒక కులంవారిలోనే ఇంటిపేర్లు వేర్వేరుగా వుంటాయి. వివాహం చెయ్యాలంటే వరుడి ఇంటిపేరూ, వధువు ఇంటిపేరూ వేర్వేరుగా వుండాలి. సాధారణంగా మేనరికం వివాహాలు సంప్రదాయంగా వున్నవి. కొన్ని సందర్భాలలో అక్క కూతురునుకూడా పెళ్ళిచేసుకుంటారు. పురుషులకు 20, 22 ఏండ్ల వయస్సులోనూ, స్త్రీలకు 16, 17 ఏండ్ల వయస్సులోనూ పెళ్ళిళ్ళు చేస్తారు. పూర్వం బాల్య వివాహాలు విరివిగా జరుగుతూ వుండేవి. పెళ్ళి ఒక శుభ లగ్నాన వధువు ఇంటిలో జరుగుతుంది. కొందరి ఇళ్ళలో ఐదు రోజుల పెళ్ళి జరుగుతుంది. కాని ఆర్థిక ఇబ్బందుల కారణంగా ఇప్పుడు ఒక రోజు పెళ్ళిళ్ళే ఎక్కువగా జరుగుతున్నయి. మొదట గణపతి పూజ జరుగుతుంది. ఆ తరువాత వివాహకాండ జరిగినమీదట వరుడు వధువు మెళ్ళో మేళతాళాల సంబరంలో మంగళసూత్రం కడతాడు. వధూవరులు వివాహ వేదికపై మూడు మార్లు ప్రదక్షిణం చేస్తారు. ఆ రాత్రి వధూవరుల వూరేగింపు జరుగుతుంది. పంటకాపు కులం వారిలో స్త్రీలకు గోషా పద్ధతి వుంటుంది గనుక వారు పెళ్ళిలో బహిరంగంగా పాల్గొనరు. రెడ్డి, కమ్మ, కాపు, రాజు కులాల వారిలో, ఇంకా ఇతర రైతు కుటుంబాలలో వరకట్నం సంప్రదాయంవుంది.

హరిజనులలో పెళ్ళి సందర్భంలో వధువువైపు స్త్రీలు వరునివైపు వారిపైన, వరునివైపు స్త్రీలు వధువువైపు వారిపైన కుంకుమ బుక్కాలు చల్లుతారు. ఆ తరువాత మేళతాళాలతో ఆడతారు. వరుడి తండ్రి వధువు నొసట అక్షతలు పెడతాడు. ఆతరువాత వధూవరులకు మంగళ స్నానంచేయించి, మధుపర్కాలు తొడిగి, బాసికాలు కడతారు. మిగిలినకాండ అంతాఇతర కులాలవారి మాదిరిగానే జరుగుతుంది. మాల మాదిగలలో (హరిజనులు) యానాదులలో వితంతు వివాహాలు కూడా జరుగుతవి. యానాదులలో బహు భార్యాత్వం వుంది. కొందరికి ఏడుగురు భార్యలు కూడా వుంటారు. జాతపులలో వివాహకాండ బహుసామాన్యంగా జరిగిపోతుంది. వారు పుస్తెకూడా కట్టరు. మూకదొరల్లో మేనరికం పద్ధతి వుంది. సవరలలో కూడా మేనరికానికి ఆక్షేపణ యేమీలేదు. గడబలలో తమ కుటుంబంలోని పిల్లల్ని చేసుకోరు.

హిందువుల సాంప్రదాయం మాదిరిగానే కోయ వారిలోకూడా శుభముహూర్తాలలోనే పెళ్ళిళ్ళు చేస్తారు. వివాహకాండ బహు సాధారణంగా వుంటుంది. వధూవరులకు సూర్యదర్శనం చేయిస్తారు. ఆతరువాత గ్రామపఔలు, దంపతులకు పాలుపళ్ళు ఇచ్చి ఆశీర్వదిస్తాడు. వీరిలో అక్క కూతుర్ని చేసుకొనే సంప్రదాయంలేదు. పురుషులు తమ ఆర్థిక స్థితినిబట్టి ఎంతమంది స్త్రీలనైనా పెళ్ళాడతారు. కోయలు ఇతరకులాల వారితో పెళ్ళిళ్ళు చేసుకోరు.

## అంత్య క్రియలు

వ్యవసాయంచేసే కులాల వారందరిలో మనిషి చనిపోతే దహనంచేసే ఆచారం వుంది. కాని పిల్లలను, పెళ్ళికాని వారిని, మశూచి కలరా మొదలగు వ్యాధులవల్ల చనిపోయిన వారిని పాతిపెట్టుతారు. శవంపై పూలుచల్లి కొత్తగుడ్డకప్పి అలంకారంచేసి మేళంతో శ్మశానవాటికకు తీసుకెడతారు. చనిపోయిన మనిషి కొడుకుగాని లేదా దగ్గరి బంధువుగాని మృతకళేబరం చుట్టూ మూడు మార్లు ప్రదక్షిణంచేసి చితికి నిప్పంటిస్తాడు. మరుసటి రోజున అస్తికలను సేకరించి దగ్గరలో ప్రవహిస్తున్న నదిలోగాని, లేదా సముద్రంలోగాని నిమజ్జనం చేస్తారు. 12 రోజులు, లేదా 15 రోజులు మైల పట్టే ఆచారంవుంది. కొన్ని కులాలవారు పదో రోజువరకు మరికొందరు పదిహేనవ రోజువరకు కర్మలు చేస్తూ వుంటారు. అన్ని కులాలవారు ప్రతి యేటా ఆబ్దికం (తద్దినం) పెడుతూ వుంటారు.

## ఆర్థిక స్థితిగతులు

రాయలసీమ జిల్లాలలోను, తెలంగాణాలోని మెట్ట ప్రాంతాలలోను, కోస్తా తీరంలోని ఎగువ జిల్లాలలోను రైతుల ఆర్థికస్థితి అంతబాగా లేదు. డెల్టా ప్రాంతంలో రైతులస్థితి మెరుగుగావుంది. స్థితిమంతులు కూడా వున్నారు. ముఖ్యంగా వాణిజ్య పంటలు పండించేవారు ధరలుబాగా వున్నట్టయితే మంచి లాభాలు పొందుతూ వుంటారు. సగటున చూస్తే ఒక్కొక్క రైతుకుండే భూమి చాలా తక్కువగా వుంటుంది. సాధారణంగా ఒక్కొక్క కుటుంబంలో భూముల విభజన జరుగుతూ వుండడం చేత కమతాలు మరీ చిన్నవై పోతూ వుంటాయి. సాగునీటి వనరులేని ప్రాంతాలలో వ్యవసాయం కేవలం వర్షపాతంమీదనే ఆధారపడి వుంటుంది. వానలు కురవకపోతే నష్టమే. గత పదేండ్లలో వ్యవసాయోత్పత్తులకు అనుకూలమైన ధరలు పలికిన ఫలితంగా రైతుల ఋణభారం కొంతవరకు తగ్గి విముక్తి కలిగినప్పటికీ ఇంకా చిన్నపాటి రైతు వ్యవసాయ పనుల నిమిత్తం అప్పులు చేయవలసి వస్తూనే వుంది. ఇట్టి రైతులకు ప్రభుత్వం తక్కావీలు, ఇతర విధములైన అప్పులిచ్చి తోడ్పడుతున్నది. అయితే గ్రామాలలో ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రవేశ పెట్టవలెనంటే ధన సహాయం అవసరమై వున్నది. చాలామంది రైతుల జీవన స్థితిగతులు వుండవలసినంతగా కూడాలేవు. వారి ఇండ్లల్లోకి గాలీ వెలుతురూ వచ్చే ఏర్పాటులేదు. పశువులు కట్టి వేయడానికి కొట్టాలుండవు. ఇప్పుడు సామాజికాభివృద్ధి పథకం క్రింద దేశవ్యాప్తంగా రైతుల పరిస్థితి బాగుపరచడానికి కృషి జరుగుతున్నది.

కొండ జాతులవారి ఆర్థిక పరిస్థితి కూడా బాగా లేదు. వారిలో సిరిసంపదలు, అధికారం పొందాలనే కాంక్షలేదు. వారు పండించే పంట వారికే చాలదు. అందుచేతనే వారు అడవులలోని దుంపలు, గడ్డలు, వెదురు చిగుళ్ళు, మామిడి టెంకెలు తినవలసి వస్తున్నది. పైగా రాకపోకలకు సౌకర్యాలులేవు. నాగరిక జనపదాలకు దూరంగా ఎక్కడో అడవులలోవుండి, దుష్టమైన వ్యవసాయ పద్ధతులను అవలంబిస్తూ వీరు నాగరికతకు దూరమై చదువు సంధ్యలు లేక, హీనస్థితిలో, అనారోగ్యంతో జీవిస్తూ వున్నారు. వీరిలో మరణాల సంఖ్యకూడా ఎక్కువగానే వుంటుంది. వీరి జీవితావసరాలు కూడా చాలా తక్కువగా వుంటాయి. డబ్బు కావలసివచ్చినప్పుడు అడవికివెళ్ళి చీపురుపుల్లలను, తాండ్ర ఉసిరిక మొదలగు కాయలను ఇతర అటవీసంపదను సేకరించుకొని బస్తీలకు తీసుకువెళ్ళి అమ్ముకుంటారు. ఇటీవల ఏజన్సీ అభివృద్ధి పథకాలు తలపెట్టబడ్డవి. కొండజాతుల వారికి కొన్ని ప్రదేశాలలో శాశ్వత ఆవాసాలను ఏర్పాటుచేసే ప్రయత్నాలు జరుగుతున్నవి. వారి ఆర్థిక పరిస్థితినికూడా బాగుచేయవలెనని తలపెట్టడింది.

## అక్షరాస్యత

ఆంధ్ర ప్రాంతంలోని గుంటూరు, కృష్ణా, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోను, తెలంగాణా ప్రాంతంలోని హైదరాబాదు, వరంగల్, మహబూబునగర్ జిల్లాలలోను రైతులలో చదువుకున్న వారు ఎక్కువమంది వున్నారు. తెలంగాణాలో అక్షరాస్యులు 9.3 శాతం వుంటే ఆంధ్రలో 15.1 శాతం వున్నారు. అంటే ఆంధ్ర ప్రదేశ్ మొత్తంమీద సగటు అక్షరాస్యత 13.1 శాతం అవుతుంది. భారత దేశపు అక్షరాస్యత 16.6 శాతం. స్త్రీలలోకంటె పురుషులలో చదువుకున్న వారు ఎక్కువమంది వున్నారు. కోస్తాజిల్లాలతో పోల్చినట్లయితే తెలంగాణా ప్రాంతంలోని కొన్ని జిల్లాలలోను, రాయలసీమ జిల్లాలలోను, శ్రీకాకుళం విశాఖపట్నం జిల్లాలోను అక్షరాస్యులు తక్కువ మంది వున్నారు. ఏజన్సీ ప్రాంతంలో అక్షరాస్యులు బహు తక్కువమంది వున్నారు. విద్యావ్యాప్తి విషయంలో అక్కడ చేయవలసిన కృషి ఎంతో వుంది. ఆంధ్ర ప్రదేశ్ లోని పాఠశాలలు, వృత్తి విద్యా కళాశాలల సంఖ్యలు ఈ దిగువ చూపబడినవి.

| క్రమ సంఖ్య | వివరాలు | ఆంధ్ర | తెలంగాణ | ఆంధ్ర ప్రదేశ్ | యావద్భార అంచెనా |
|---|---|---|---|---|---|
| 1. | పాఠశాలలు | 20,123 | 7703 | 27826 | 321405 |
| 2. | కళాశాలలు | 32 | 15 | 47 | 631 |
| 3. | వృత్తివిద్యాకళాశాలలు | 24 | 7 | 31 | 328 |

## వ్యవసాయ పద్ధతులు

సాధారణంగా దేశవాళీ నాగలితో పొలందున్న బడుతుంది. అయితే చవుకరకం ఇనుపనాగళ్ళు ఇటీవల ప్రవేశపెట్ట బడినవి. ఇవి వ్యాప్తిలోనికి వస్తున్నవి. ఇటీవల ట్రాక్టర్లతో, బుల్ డోజర్లతో కూడా వ్యవసాయం చేయబడుతున్నది. భూమిని దున్నడానికీ, చదును చేయడానికీ, నూర్పులకూ ట్రాక్టర్లు ఉపయోగింప బడుతున్నవి. పూర్వం మోటకట్టి బావుల నుంచి నీరు తోడేవారు. ఇప్పటికీ ఈ పద్ధతి వుంది కాని ఇటీవల ఆయిల్ ఇంజనులు, ఎలక్ట్రిక్ మోటారులు ఉపయోగింప బడుతున్నవి. పూర్వం కొయ్యగానుగలలో చెరకునుఆడించి రసం తీసేవారు. ఇప్పుడు ఐరన్‌క్రషర్లు ఉపయోగిస్తున్నారు. పైరులకు పడు తెగుళ్లను నివారించడానికై స్ప్రేయర్లు, డస్టర్లు వాడుతున్నారు. రాష్ట్రంలోని వ్యవసాయ తరగతులవారు తెలివితేటలు గలవారు. సాంప్రదాయకమైన పద్ధతులనే ఎంతో నిపుణతతో అనుసరిస్తూ మంచిపంటలు పండించ గలుగుతున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని రాయలసీమ జిల్లాలు, శ్రీకాకుళం విశాఖపట్నం జిల్లాల రైతులు, తెలంగాణాజిల్లాల రైతులు మెట్టవ్యవసాయంలో నేర్పరులు. గుంటూరు, కృష్ణా తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, నెల్లూరు, నిజామాబాదు జిల్లాల రైతులు మాగాణి వ్యవసాయంలో ఆరితేరినవారు. కడప చిత్తూరు జిల్లాల రైతులు కష్టించి పనిచేసి బావులక్రింద తోటలలో పెద్దపంటలు పండించడంలో ప్రవీణులు. నల్లరేగడి భూములలో మెట్టసేద్యం నిమిత్తమై మూడేండ్ల కొకమారు పెద్దమడక ఆడించి బాగా లోతుకు పాదుకొని పోయిన హర్యాలీ మొదలగు కలుపు మొక్కలను నిర్మూలిస్తారు. సాధారణంగా రేగడి భూములలో గొర్రు, గుంటక తోలుతారు.

## విత్తనాలు వేసే పనిముట్లు

మెట్టపైరుల విత్తనాలు వేయడానికి సాధారణంగా గొర్రు ఉపయోగిస్తారు. విత్తనాలపై మట్టిని కప్పడానికై గొర్రు వెనక గుంటక తోలుతారు. కలుపు మొక్కలను తొలగించడానికి మెట్ట భూములలో మెట్టగుంటక తోలుతారు. దీనికి గొర్రు తోలడం కూడా కద్దు.

## కోతల పనిముట్లు

వేరుసెనగ పంటను సంగ్రహించటానికి గుంటక బారు గుంటక ఉపయోగిస్తారు. ప్రత్తి దుబ్బులను తొలగించడానికి కూడా గుంటకను, బారు గుంటకను పొలంలో ఎదురు మూలల తోలుతారు. ఈ

(తరువాయి 52 వ పేజీలో)

# కర్నూలు వైద్య కళాశాల



## రాయలసీమకు ఇతోధికంగా వైద్య, ప్రజారోగ్య సౌకర్యాలు కలిగే అవకాశం

యూనియన్ ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి 1957 జూలై 21 వ తేదీన కర్నూలు వైద్య కళాశాలకు ప్రారంభోత్సవం జరిపారు. రాయలసీమలో ఇది మొట్టమొదటి వైద్య కళాశాల. ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాల.

*వైద్య కళాశాల ప్రారంభోత్సవ సభకు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ సందేశం పంపుతూ ఇట్టి కళాశాలల ప్రాముఖ్యాన్ని ఇలా వివరించారు. "చిన్న పట్టణాలలో ఈ విధంగా వైద్య కళాశాలలు తెరువడం మిక్కిలి హర్షింపదగిన విషయం. పెద్దపెద్ద పట్టణాలలో నివసిస్తూ వైద్య విద్య చదివినమీదట పల్లెప్రాంతాలకు వెళ్ళి సేవచేయడానికి ఎందరో నిరాకరిస్తున్న రోజుల్లో చిన్న పట్టణాలలోనే ఇలాంటి కళాశాలలు స్థాపించి వైద్య పట్టభద్రులను తయారుచేయడం అభిలషణీయం".*



కర్నూలులోని "పొట్టి శ్రీరాములు భవనం" దృశ్యం. ఈ భవనంలోనే వైద్య కళాశాల పెట్టబడింది. ఈ కళాశాలకు 1957 జూలై 21 వ తేదీన యూనియన్ ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి ప్రారంభోత్సవం జరిపారు.



యూనియన్ ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి జూలై 21 వ తేదీన కర్నూలు వైద్య కళాశాలకు ప్రారంభోత్సవం జరిపారు. చిత్రంలో వారు కళాశాలలోని నమూనాలను, చార్టులను పరిశీలిస్తున్నారు.

1953 అక్టోబరు 1వ తేదీనుంచి మద్రాసు నుంచి విడిపోయిన తరువాత ఆంధ్రరాష్ట్రానికి రెండు వైద్యకళాశాలలు వున్నవి. ఒకటి ఉత్తరం చివరన విశాఖపట్టణంలో, రెండవది మధ్యప్రాంత మైన గుంటూరులో.

ప్రణాళికక్రింది పథకాలకు అవసరమైన డాక్టర్లను తయారు చేయడానికీ, ప్రైవేటు ప్రాక్టీసుకుకూడా ఎక్కువమంది డాక్టర్లను లభింపజేయడానికీ మరొక కళాశాలను స్థాపించడం అవసరమని పూర్వపు ఆంధ్ర రాష్ట్ర హయాంలోనే గుర్తింపబడింది. అందుచేత 1956 జులై నుంచి కర్నూలులో వైద్యకళాశాలను ప్రారంభించవలెనని రాష్ట్రప్రభుత్వం 1955 నవం బరులోనే నిర్ణయించింది. పైగా కర్నూలులో రాష్ట్ర తాత్కాలిక రాజధాని నెలకొనడంవల్ల కూడా కర్నూలు హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిని జనరల్ ఆసుపత్రిగా అభివృద్ధి పరచడం అవసరమైంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి, రాష్ట్ర రాజధాని హైదరాబాదుకు మారినప్పుడు కర్నూలులోని సెక్రటేరియెట్ భవనాలు వైద్యకళాశాల నిమిత్తం ఇచ్చివేయబడ్డవి. అక్కడ కొత్తగా కట్టబడిన శాసన సభ్యుల హాస్టలు వైద్యవిద్యార్థుల హాస్టలుకొరకు, ప్రభుత్వ వసతిగృహం విద్యార్థినుల హాస్టలునిమిత్తం ఇచ్చివేయబడ్డవి. కాలేజీసిబ్బంది నివాసం కొరకు ఎ. బి. సి. క్యాంపులలో ఆఫీసర్లకొరకు కట్టబడిన ఇండ్లు ఇచ్చివేయబడ్డవి. ఈ భవనాలన్నీ 295 ఎకరాల విస్తీర్ణంలో వున్నవి. వీటికి ఒక కోటి రూపాయలు వ్యయమైంది. ఈ విధంగా అవసరమైన భవనాలతో కర్నూలులో వైద్యకళాశాలను ప్రారం భించటం చాలా సులభమైంది.

1955 డిసెంబరు నెలాఖరులో వైద్యశాఖ డైరెక్టరు కర్నూలులో వైద్యకళాశాలను స్థాపించ డానికి భవనాలు, ఇతర వసతులు ఎంతవరకు లభించ గలవో పరిశీలించమని చెప్పి గుంటూరు వైద్యకళా శాల ప్రిన్సిపాలు శ్రీ డి. జగన్నాథరెడ్డిని నియ మించారు. ఆయన సమగ్రపరిశీలన జరిపి నివేదికను సమర్పించారు. 1956 జూన్ 7వ తేదీన

కర్నూలులో జరిగిన ఆంధ్రప్రభుత్వ ఉన్నతాధికార సమావేశంలో ప్రభుత్వం ఈ వైద్యకళాలకు భవనాలను నిర్ణయించడమేగాక, రూ. 17 లక్షల ఖర్చుతో గవర్నమెంటు జనరల్ ఆసుపత్రిని విస్తరించే పథకాన్ని కూడా ఆమోదించింది.

అయితే 1951 జులై 1వ తేదీన ఈ కళాశాలను ప్రారంభించడానికి ఏర్పాట్లన్నీ పూర్తికాక పోవడంవల్ల రాయలసీమ ప్రాంతంనుంచి కర్నూలు వైద్యకళాశాలలో వైద్యవిద్య చదవడానికై దరఖాస్తులు పెట్టుకున్న 50 మంది విద్యార్థులకు ఆ తేదీనే తాత్కాలికంగా గుంటూరు వైద్యకళాశాలలో ప్రవేశ మివ్వబడింది. అయితే ఆ తర్వాత వారు కర్నూలు వైద్యకళాశాలలోనే చదువవలసి వుంటుందన్న షరతుతోనే వారిని చేర్చుకొనడమైనది.

## పథక రచనాసంఘం

కర్నూలు వైద్యకళాశాల స్పెషల్ ఆఫీసరుగా ఫిజియోలజీ ప్రొఫెసర్ డా. జి. వెంకటరామయ్యా నియమింపబడ్డారు. ఆయన 1956 జూన్ 26 వ తేదీన తమ పదవిలో చేరారు. ఆంధ్రలో ప్రతి వైద్యకళాశాలకూ రాష్ట్ర వైద్యశాఖ డైరెక్టరు ఒక పథక రచనాసంఘాన్ని నియమించారు. ఇక్కడ ఇదొక ప్రత్యేకవిషయం. ప్రతి కళాశాల పథక రచనాసంఘంలో వైద్యశాఖ డైరెక్టరు, ప్రిన్సిపాలు ఆసుపత్రి సూపరింటెండెంటు, ప్రొఫెసర్లు వుంటారు. ఈ సంఘంవారు అప్పుడప్పుడు సమావేశమై కాలేజీ, ఆసుపత్రి, ఎంతవరకు అభివృద్ధి చెందిందీ, ఒక నిర్ణీత పథకంప్రకారం ఎలా అభివృద్ధి సాధింపడవలసిందీ చర్చిస్తారు. ఒక్క సంవత్సరంలో కర్నూలువైద్యకళాశాల కర్నూలు జనరల్ ఆసుపత్రికి సంబంధించిన పథక రచనాసంఘం పన్నెండుమార్లు సమావేశమైంది. ఇటువంటి ఏర్పాట్లవల్ల కర్నూలు వైద్యకళాశాల త్వరగా నెలకొల్పబడడానికి వీలుకలిగింది.

1956జూలైలో వైద్యశాఖడైరెక్టరు కర్నూలు వైద్యకళాశాలను శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయానికి అనుబంధ సంస్థగా చేర్చుకోవలసిందని దర



యూనియన్ ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి 21-7-1957 తేదీన కర్నూలు వైద్య కళాశాలకు ప్రారంభోత్సవం జరిపిన దృశ్యం.



కర్నూలు వైద్య కళాశాల అవసర నిమిత్తమై కర్నూలులోని జనరల్ ఆసుపత్రి రూ 17 లక్షల ఖర్చుతో అభివృద్ధి పరచబడింది. చిత్రంలో కొత్తగా నిర్మింపబడిన భవనాన్ని చూడవచ్చు.

ఖాస్తు పంపారు. ఆ విశ్వవిద్యాలయాధికార్లు మద్రాసు విశ్వవిద్యాలయోపాధ్యాయులు డా. ఏ. లక్ష్మణస్వామి మొదలియారు నాయకత్వాన ఒక ఇనస్పెక్షన్ కమీషన్‌ను పంపారు. ఆరుగురు సభ్యులతో కూడిన విచారణసంఘం 1956 ఆగస్టు 18 వ తేదీన వైద్యకళాశాలను సందర్శించి పరిశీలన జరిపినమీదట నివేదికను అందజేసింది. ఆ నివేదికలో కళాశాల, జనరల్ ఆసుపత్రి కొరకు చేయబడిన పర్పాట్లపై సంతృప్తి ప్రకటించబడింది. సిబ్బంది విషయంలోను, కళాశాలలోని వివిధ శాఖలకు అవసరమైన సామగ్రిని ఏర్పాటుచేసే విషయంలోను యం. బి. బి. యస్. కు సంబంధించిన వివిధ కోర్సులను నిర్వహించే విషయంలోను నివేదికలో కొన్ని షరతులు పెట్టారు. కళాశాలను అనుబంధ సంస్థగా చేర్చుకొనే విషయంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులు కూడా ఆ షరతులనే పునరుద్ఘాటించారు. ప్రభుత్వం ఆ షరతులకు ఒప్పుకుంది. ఆమీద విశ్వవిద్యాలయ అధికార్లు తాత్కాలికంగా రెండేళ్ళవరకు కళాశాలను అనుబంధించుకొనే విషయంలో అనుమతి ఇచ్చారు. విశ్వవిద్యాలయం వారు ఇటీవల విశాఖపట్నం ఆంధ్రవైద్యకళాశాలలో అప్‌గ్రేడెడ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాథాలజీ డైరెక్టరు డా. డి. గోవిందరెడ్డి అధ్యక్షతన వైద్య శాస్త్రానికి బోర్డు ఆఫ్ స్టడీస్‌నుకూడా నెలకొల్పారు. కర్నూలు వైద్యకళాశాల "పొట్టి శ్రీరాములు భవనం" లో నెలకొల్పబడింది. పూర్వం అందులో ఆంధ్ర ప్రభుత్వ సెక్రటేరియెట్‌లో కొంతభాగం వుండేది. ఈ కళాశాలలో ప్రస్తుతం 50 మంది విద్యార్థులకు వైద్యవిద్య బోధింపబడుతుంది. ఆ తర్వాత క్రమేణా రెండవ ప్రణాళిక అంతంలో నూరు విద్యార్థుల వరకూ బోధన జరపడానికి అనువుగా అభివృద్ధి పరచబడుతుంది.

ఈ కళాశాల స్థాపనతో ఆంధ్రప్రదేశ్‌లో వైద్య కళాశాలలు అన్ని ప్రాంతాలలో సమంగా నెలకొల్పబడి వున్నవని చెప్పవచ్చు. ఒక కళాశాల తూర్పు

(తరువాయి 52 వ పేజీలో)

# స్వాతంత్ర్యసిద్ధిపిమ్మట 10 వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖ పురోగమనం



*ముక్కోటి ఆంధ్ర ప్రజల చిరకాల వాంఛితం ఈడేరి 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం అవతరించింది. ఇది దక్షిణాది రాష్ట్రాలన్నిటిలో పెద్దది. అపారమైన ప్రకృతిసంపద ఈ రాష్ట్రానికి వుంది. సాగుకు కావలసినంత నీరు వుంది. అనేక ఖనిజాలున్నవి. విద్యుదుత్పత్తికి అవకాశాలున్నవి. ఆర్థిక సాంఘిక రాజకీయ రంగాలలో పురోగమించాలనే గాఢమైన అభిలాష ప్రజలలో వుంది. కనుక సంపత్సౌభాగ్యాలకోసం దేశం తలపెట్టిన అభ్యుదయ పథంలో ఆంధ్ర ప్రదేశ్ అగ్రగామిగా వుండగలదు. మనదేశం స్వాతంత్ర్యమై పదేళ్ళు కావస్తూవుంది. ఈ పదవ సంవత్సరంలో రాష్ట్రం సాధించిన అభివృద్ధిని బట్టిచూస్తే దీనికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు వున్నట్లు తెలుస్తుంది.*

ఆంధ్ర తెలంగాణాలు ఏకరాష్ట్రంగా ఏర్పడ్డం అత్యంత ప్రధాన విషయం. ఎందుచేతనంటే ఈ రెండుప్రాంతాల వ్యవసాయ వసతులు పరస్పరం దోహదకారిగా వున్నవి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యంగా వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రం. అందుచేతనే ఈ సంవత్సరం వ్యవసాయ పద్దుక్రింద ఈ రాష్ట్రానికి రూ. 122. 79 లక్షలు కేటాయించ బడ్డవి. ఆ మొత్తంలోనుంచి దాదాపు 41 పథకాలకు రూ. 87. 43 లక్షలు మంజూరు చేయబడ్డవి.

ఈ సమీక్షా కాలంలో మేలిరకం విత్తనాలు విరివిగా వాడవలసిందని వ్యవసాయదారులలో బాగా ప్రచారం చేయబడింది. ఫలితంగా రాష్ట్రంమొత్తంలో 4985 టన్నుల మేలిజాతి విత్తనాలు పంపిణీ చేయబడ్డవి. 301 టన్నుల పచ్చిఎరువు కూడా పంపిణీ చేయబడింది. రసాయనిక ఎరువుల పంపిణీ కూడా చాలా హెచ్చింది. 1,16,028 టన్నుల రసాయనిక ఎరువు పంపిణీ చేయబడింది. అంటే దేశంలో రసాయనిక ఎరువులను హెచ్చుగావాడే రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ కూడా ఒకటయింది. వ్యవసాయదారులకు మరింతగా తోడ్పడాలనే ఉద్దేశంతో విశేషంగా ఎరువులను ఉపయోగింపజేసే పథకంక్రింద ఆంధ్రప్రాంతంలో రసాయనిక ఎరువుల కొనుగోలు నిమిత్తమై రూ. 95,60,285 ల మేరకు రైతులకు అప్పులివ్వబడ్డవి. శాస్త్రీయమైన ఆధునిక వ్యవసాయ పద్ధతులను వ్యాప్తిలోనికి తేవడానికై వ్యవసాయశాఖకు సంబంధించిన ప్రత్యేక ప్రచారోద్యోగులు కొత్తరకం పనిముట్లు, మేలిరకం విత్తనాలు, రసాయనిక ఎరువులను ఎలా ఉపయోగించ వలసిందీ రైతులకు ప్రదర్శించి చూపారు. తుంగభద్ర ఆయకట్టుక్రింద 14,929 ఎకరాల ఆయకట్టు సర్వే చేయబడింది. దానికి ప్లానులు తయారు చేయబడ్డవి, కట్టలు గుర్తు పెట్టబడ్డవి.

## నాగార్జునసాగర్ ప్రాజెక్టు

ఈ రాష్ట్రంలో నాగార్జునసాగర్ బహుళార్థ సాధక ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాథమిక పనులు చాలావరకు జరిగాయి. ఈ సమీక్షా కాలంలో నది వెడల్పులో మూడవవంతును చుట్టుతూ కాఫర్‌డాము నిర్మాణం పూర్తిచేయబడింది. సిబ్బందికొరకు నివాసగృహాలు కట్టబడ్డవి. కుడివైపుకాలువ సవివర పరిశోధన 52 వ మైలు వరకు, ఎడమవైపుకాలువ పరిశోధన 35 వ మైలు వరకూ పూర్తి చేయబడింది.

రాష్ట్రీ రెండవ ప్రణాళికలో చేర్చబడ్డ భారీ నీటివసతి పథకాలలో తుంగభద్ర ప్రాజెక్టు హైలెవల్ కాలువ ఒకటి. దీనిఖర్చు అంచెనా రూ. 25. 85 కోట్లు. ఈప్రాజెక్టుకు 1956 అక్టోబరులో ఆంధ్ర మైసూరు ముఖ్యమంత్రులు ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రప్రాంతంలో ఈ పథకానికి సంబంధించిన ప్రాథమికపనులను ఆరంభించడానికై ఆంధ్రప్రభుత్వం రూ. 16. 98 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ సమీక్షా కాలంలో ఆ పనులు చాలావరకు పూర్తిఅయ్యాయి. ఆంధ్ర ప్రాంతంలో ప్రథమ ప్రణాళిక కాలంలో ఉప్పుటేరు దిగువ ఆనకట్ట పథకం, పాలేరు రిజర్వాయరు పథకం, నక్కలగండి రిజర్వాయరు పథకం, రాళ్ళపాడు రిజర్వాయరు పథకం, ఎగువ పెన్నార్ ప్రాజెక్టు, బండకట్టు కాలువ పథకం, విద్యారంగస్వామి టాంకు ప్రాజెక్టు మొదలైన మధ్యరకం సాగునీటి పథకాలు ప్రారంభింపబడి పూర్తిచేయబడ్డవి.

తెలంగాణాప్రాంతంలో ప్రథమ ప్రణాళికా కాలంలో అయిదు మధ్యరకంప్రాజెక్టులు తలపెట్టబడ్డవి. వాటిలో కోయిలసాగర్, భీమనపల్లిప్రాజెక్టులు పూర్తి అయ్యాయి.

1958 సంవత్సరం వరకల్లా కోయిలసాగర్ ప్రాజెక్టు క్రింద 1200 ఎకరాలకు, భీమనపల్లి ప్రాజెక్టుక్రింద 1800 ఎకరాలకు సాగునీరు లభించవచ్చు. ఈ సంవత్సరం కోయిలసాగర్ ప్రాజెక్టుక్రింద 7,154 ఎకరాలు, భీమనపల్లి ప్రాజెక్టుక్రింద 1,000 ఎకరాలు అభివృద్ధి పరచబడ్డవి. మిగిలిన సరళాసాగర్, మూసీ, సిరాళా ప్రాజెక్టుల నిర్మాణం వివిధ దశలలోవుంది.

## విద్యుచ్ఛక్తి పథకాలు

రామగుండం థర్మల్ స్కీములో మొత్తం పవర్ హౌస్, బాయిలర్ హౌస్, సర్క్యులేటింగు వాటర్ పంపు, కూలింగ్ టవర్, గోదావరినది ఒడ్డున మెయిన్ పంపింగ్ స్టేషన్ మున్నగువాటి నిర్మాణం పూర్తిచేయబడింది. ట్రాన్స్మిషన్ లైనుల పనికూడా చాలావరకు జరిగింది. నిజాంసాగర్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు విషయంలో ఎర్రగడ్డ సబ్ స్టేషన్నుంచి హుసేన్‌సాగరు పవర్ స్టేషన్ వరకు ఓవర్ హెడ్ లైను వేయడం పూర్తి అయింది.

మాచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకం ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రాల ఉమ్మడి పథకం. దీనికి రూ.13½ కోట్లు ఖర్చు అవుతుందని అంచెనా. ఈ పథకానికి 1955 ఆగస్టులో రాష్ట్రపతి ప్రారంభోత్సవం జరిపారు. మాచ్‌ఖండ్ స్టేషను పూర్తి కెపాసిటీ 1,14,750 కిలోవాట్లు ఉండగలదు.

## భూ సంస్కరణలు

సమీక్షా కాలంలో 1950 సంవత్సరపు మద్రాసు ఎస్టేటు భూముల (ఆంధ్ర సవరణ) చట్టం, 1956 సంవత్సరపు ఆంధ్ర ఈనాముల రద్దు, (రైత్వారీగా మార్పు) చట్టం- ఈ రెండు చట్టాలను అమలులోకి తెచ్చి తద్వారా ఇంటర్మీడియరీ కౌళ్ళను రద్దుచేసి రాష్ట్రమంతటా ఒకేవిధమైన కౌలు పద్ధతిని ప్రవేశపెట్టడం జరిగింది. మొదటిచట్టం "ఎస్టేటు" నిర్వచనాన్ని విస్తృతం చేయడానికీ, రెండవచట్టం ఎస్టేటు కాక, ఇతర విధములైన అన్ని ఈనాములను రద్దు చేసి వాటిని రైత్వారీ కౌలు పద్ధతికి మార్చడానికి అవకాశం కలిగిస్తాయి. సమీక్షా కాలంలో, భూస్వామి కౌలుదారుకుండే సంబంధాలను క్రమబద్ధంచేసి, చెల్లించవలసిన కౌళ్ళను నిబంధీకరించి, కౌలుకు హామీ చేకూర్చడానికై 1956 సంవత్సరపు ఆంధ్ర కౌల్దారీ చట్టము ననుసరించి తగు శాసన నిర్మాణం చేపట్టబడింది.

సమీక్షా కాలంలో 1956 సంవత్సరపు హైద్రాబాదు భూముల విభజన నిరోధన, కమతాల ఏకీకరణ చట్టం అమలు జరుపబడింది. ఈచట్టం తెలంగాణాలోని వివిధ ప్రాంతాలలో కొన్ని ప్రమాణబద్ధమైన ప్రాంతాలను నిర్ధారణ చేయడానికీ, కమతాలను ఏకీకరించడానికీ అవకాశం కలిగించింది.

## సామాజికాభివృద్ధి

1957 మార్చి నెలాఖరు వరకు రాష్ట్రంలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నట్టి బ్లాకులు 150 వున్నవి. వీటిలో 40 సామాజికాభివృద్ధి బ్లాకులు. వీటిలో 27 బ్లాకులు

ఆంధ్ర ప్రాంతంలో వున్నవి. జాతీయ విస్తరణ సేవా కేంద్రాల సంఖ్య 84. వీటిలో 62 ఆంధ్ర ప్రాంతంలో, మిగిలినవి తెలంగాణా ప్రాంతంలో వున్నవి. అనంతర తీవ్రకృషి బ్లాకుల సంఖ్య 22. వీటిలో ఆంధ్రలో 16, తెలంగాణాలో 6 వున్నవి. బహుళార్థసాధక ప్రాజెక్టులు 4. 1956 ఏప్రిల్ నెలారంభంలో రాష్ట్రంలో కొత్తగా 41 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు ప్రారంభింపబడ్డవి. అదే కాలంలో బహుళార్థసాధక ప్రాజెక్టులు 4 అనంతర తీవ్రకృషి బ్లాకులు 18 ఏర్పడ్డవి. వీటిలో జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు 19. అనంతర తీవ్రకృషి బ్లాకులు 16. తెలంగాణాలో 2 బహుళార్థసాధక బ్లాకులు పెట్టబడ్డవి.

## సహకారం

ఆంధ్రలో సహకారానికి సంబంధించిన అన్ని పథకాలకు మొత్తం రూ. 285.24 లక్షలు కేటాయింప బడ్డవి. అందుకు ప్రథమ సంవత్సర (1956-57) కార్యక్రమంలో రూ. 72.68 లక్షల మేరకే పథకాలు చేర్చబడ్డవి. సహకారగిడ్డంగులు, మార్కెటింగు పద్దుక్రింద ఆంధ్ర ప్రాంతంలో 1956-57 సంవత్సరంలో ఆరు పథకాలు అమలు జరుపబడ్డవి. వాటిలో ఏకీకృత గ్రామీణ పరపతి పథకం, గ్రామీణ పరపతి పథకాల విస్తృతీకరణ వాటి కార్యకలాపాల అభివృద్ధి, సహకార మార్కెటింగు ముఖ్యమైనవి.

తెలంగాణాప్రాంతంలో ప్రభుత్వభాగస్వామ్యంతో గిడ్డంగి సౌకర్యాలతో 50 మార్కెటింగ్ సొసైటీలను వ్యవస్థీకరించే పథకం ఒకటి అమలు జరుపబడింది. అంతేగాక సమీక్షా కాలంలో మూడు మార్కెటింగ్ సొసైటీలు ప్రారంభింపబడ్డవి. సహకార పరపతిని అభివృద్ధి పరచడానికై తలపెట్ట బడ్డ పథకంక్రింద ఈ సంవత్సరం 26 పెద్ద రకపు సఘాంలు నెలకొల్పబడ్డవి. ఇటువంటి 45 సంఘాలను ఏర్పాటు చేయవలెనని మొదట ఒక లక్ష్యం నిర్ణయింపబడింది.

వ్యవసాయోత్పత్తిని పెంపొందించడానికై రైతులకు ఉదారంగా ఆర్థిక సహాయం చేయబడింది. ప్రణాళికా సంవత్సరం 1956-57 లో స్వల్ప కాలిక ఋణాలక్రింద రూ. 586 లక్షలు అప్పుగా ఇవ్వవలెనని లక్ష్యం నిర్ణయింపబడగా రూ 643 లక్షలు అప్పుగా ఇవ్వబడ్డవి. ఇదే కాలంలో తెలంగాణా ప్రాంతంలో రూ 50.44 లక్షల మేరకు అప్పులివ్వబడ్డవి. ఇక దీర్ఘకాలిక ఋణాల విషయంలో ఆంధ్రప్రాంతంలో ముఖ్యంగా భూమి తనఖాబ్యాంకుల ద్వారా రూ. 71.00 లక్షలు అప్పుగా ఇవ్వబడ్డవి. తెలంగాణాప్రాంతంలో సహకారోద్యమం పెద్దగా అభివృద్ధి చెందలేదు. గనుక పై కాలంలో రూ 4.76 లక్షలు అప్పుగా ఇవ్వబడ్డవి.

## విద్య

1956-57 సంవత్సరంలో తెలంగాణా ప్రాంతానికి మంజూరు చేయబడిన కొత్తపథకాలు ఇవి: హైదరాబాదు నగరంలోనూ వివిధ జిల్లాలలోనూ కొత్తగా 11 కేంద్ర ప్రాథమిక పాఠశాలల స్థాపన: 82 స్వచ్ఛంద ఎయిడెడ్ పాఠశాలలను ఏకోపాధ్యాయ ప్రాథమిక పాఠశాలలుగా మార్చడం; కొత్తగా 314 ఏకోపాధ్యాయ ప్రాథమిక పాఠశాలల స్థాపన; వివిధ జిల్లాలలోని 120 ప్రాథమిక పాఠశాలలకు అదనపుసిబ్బంది; 116 ప్రాథమిక పాఠశాలలను జూనియర్ బేసిక్‌స్కూళ్ళుగా మార్చడం. గవర్నమెంటు సెకండరీ టీచర్సు బేసిక్ ట్రెయినింగుస్కూళ్ళు తొమ్మిదింటికి సైన్సు పరికరాలు, లెబొరేటరీ సామగ్రి కొనుక్కునే నిమిత్తమై ఒక్కొక్కదానికి రూ. 300-ల చొప్పున ఏడాదికి రూ. 2,700-ల అవృత్తవ్యయం మంజూరు చేయబడింది. బేసిక్ ట్రెయినింగు సంస్థలలో రెండవ సంవత్సరపు కోర్సులో శిక్షణపొందేవారికి స్టయిపండ్లు, అలవెన్సులు ఇవ్వడానికై రూ. 1,74,806-లు వ్యాయామశిక్షణలో శిక్షణపొందేవారికి స్టయిపండ్లు, అలవెన్సులు ఇవ్వడానికి రూ. 26,400-లు మంజూరు చేయబడ్డవి.

ప్రథమ ప్రణాళిక అంతంలో తెలంగాణాలో దాదాపు 7,000 ప్రాథమిక పాఠశాలలున్నవి. వాటిలో 5,04,285 మంది పిల్లలు చదువుకొంటూ వుండేవారు. 116 ప్రాథమిక పాఠశాలలు జూనియర్ బేసిక్‌స్కూళ్ళుగా మార్చబడ్డవి.

1956 సంవత్సరపు ఆంధ్ర విద్యా సంస్థల (స్వాధీన) చట్టం క్రింద ప్రభుత్వం ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలను స్వాధీన పరచుకొనే పథకం

ప్రయోగాత్మకంగా 1956-57 విద్యా సంవత్సరం నుంచి నెల్లూరు జిల్లాలో ప్రవేశ పెట్టబడి, 1957 ఏప్రిలు నెలాఖరు వరకు పూర్తి చేయబడింది. ఈ పథకాన్ని ఇతర జిల్లాలకు కూడా విస్తరింపజేసే విషయం ప్రభుత్వం ఆలోచనలో వున్నది.

ప్రథమ ప్రణాళిక అంతంలో ఆంధ్రప్రాంతంలో 14,067 ప్రాథమిక, జూనియర్ బేసిక్‌స్కూళ్ళు వుండేవి. విద్యావంతులైన వారికి పనులు చూపాలనే ఉద్దేశంతో తలపెట్టబడిన పథకంక్రింద తెరువబడిన 1,829 పాఠశాలలుగాక అదనంగా 1550 క్రొత్త ఎలిమెంటరీ పాఠశాలలు తెరువబడ్డవి.

ఇటీవల ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల వేతనాలు నెలకు రూ. 6-ల చొప్పున హెచ్చింపబడ్డవి.

ఆంధ్ర ప్రాంతంలో 375 హైస్కూళ్ళు వున్నవి. ప్రథమ ప్రణాళిక కాలంలో 21 హైస్కూళ్ళు పెట్టబడ్డవి. తెలంగాణాలో 101 హైస్కూళ్ళు, 150 మిడిల్ స్కూళ్ళు వున్నవి.

ఆంధ్రప్రాంతంలో సాధారణ విద్యకు 32 కాలేజీలు, వృత్తి విద్యకు ఎనిమిది కాలేజీలు, ప్రత్యేక విద్యకు 15 కాలేజీలు వున్నవి. గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీకి, విజయనగరంలోని యం. ఆర్. కాలేజీకి సంబంధించిన రెండు బి. ఇడి సెక్షన్ లేగాక పురుషులకోరకై ఏర్పాటుచేయబడిన మూడు ప్రభుత్వ టీచర్సు ట్రెయినింగు కాలేజీలను కూడా అభివృద్ధి పరచవలెనని తలపెట్ట బడింది. ఉస్మానియా యూనివర్సిటీ చార్టర్ ననుసరించవలెనన్న ప్రతిపాదన కూడాప్రభుత్వ పరిశీలనలో వుంది.

ఉస్మానియా విశ్వ విద్యాలయం 1956-57 సంవత్సరంనుంచి మూడేళ్ళ డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టింది. ఆంధ్ర, శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయాలు 1957-58 నుంచి ప్రీ యూనివర్సిటీ కోర్సును ప్రవేశ పెడుతున్నవి.

పెంటపాడులో పట్టభద్రానంతర బేసిక్ ట్రెయినింగు కాలేజీ స్థాపించబడింది. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో అండర్ గ్రాడ్యుయేటుకోర్సును, పోస్టు గ్రాడ్యుయేటు టీచింగు రీసర్చిని అభివృద్ధిపరచడానికి అవకాశం కల్పించబడింది.

రాష్ట్రంలో నాలుగు ఇంజనీరింగు కాలేజీలున్నవి. కాకినాడ, అనంతపురం ఇంజనీరింగు కాలేజీలను రూ. 87.66 లక్షల ఖర్చుతో అభివృద్ధి పరచడమైనది. ఈ నాలుగు కాలేజీలలో మొత్తం సీట్లసంఖ్యను ఈ సంవత్సరంనుంచి 400 నుంచి 570 వరకు హెచ్చించడమైనది.

కర్నూలులో 1957 జులై 21 వ తేదీన వైద్య కళాశాలకు యూనియన్ ప్రభుత్వ ఆర్థిక మంత్రి ప్రారంభోత్సవం జరిపారు. రాష్ట్రి వైద్య విద్యా రంగంలో ఇది ముఖ్యమైన విశేషం.

రాష్ట్రంలో 5 పాలీటెక్నికులున్నవి. వీటిలో గత సంవత్సరం విశాఖపట్నంలో ప్రారంభింప బడిన పాలీటెక్నిక్ కూడా ఒకటి. ఈ అయిదింటిలో వివిధ కోర్సులలో మొత్తం 580 సీట్లు వున్నవి. ఈ సంవత్సరం నుంచి సీట్లసంఖ్య 600 చేయబడింది. ఇవిగాక 1957 జులైలో తిరుపతిలో క్రొత్తగాపెట్టబడిన పాలీటెక్నికులో 100 సీట్లు వున్నవి. కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో ఈ సంవత్సరంనుంచి కొత్తగూడెం, గూడూరులలో రెండు మైనింగ్ ఇన్‌స్టిట్యూట్లు స్థాపించబడ్డవి. వీటిలో డిప్లొమా కోర్సులు గలవు. ఈ రెండింటిలో ఒక్కొక్కదానిలో 40సీట్లు వున్నవి. మహబూబ్‌నగర్ లో ఒక ప్రైవేటు పాలీటెక్నిక్‌వుంది. ఇది అఖిలభారత సాంకేతిక విద్యా సంఘుంతాలూకు దక్షిణ మండల కమిటీవారి పరిగణనను పొందవలసివున్నది. పార్లమెంటు సభ్యుడు శ్రీ అక్బరలీఖాన్ ఇచ్చిన విరాళంతో హైదరాబాదులో ఒకపాలీటెక్నిక్ ప్రారంభింపబడింది.

హైదరాబాదులోని ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల తాలూకు బ్రాంచి ఇన్‌స్టిట్యూట్ ఒకటి సికింద్రాబాదులో నెలకొల్ప బడింది. ప్రస్తుతమున్నట్టి సంస్థలో అదనపుసిబ్బందిని నియమించి, పరికరాలను సమకూర్చి, భవనములను నిర్మించి, ఎక్కువ మొత్తాలలో స్కాలర్‌షిపులను ఇచ్చి అభివృద్ధి పరచవలసి వున్నది.

ఆటల మైదానాలకు స్థలాలను సేకరించడానికై ప్రభుత్వం గ్రాంట్లు మంజూరు చేస్తున్నది. అంతేగాక ప్రభుత్వేతర సంస్థలలోని ఉపాధ్యాయుల ప్రావిడెంటు ఫండులకు కంట్రిబ్యూషన్లు కూడా ఇస్తున్నది. ప్రభుత్వ పాఠశాల లన్నిటిలో కులమత

ఆదాయ విచక్షణలతో నిమిత్తం లేకుండా పిల్లలకు మూడవఫారం వరకు ఉచితంగా విద్య గరపబడు తున్నది.

## స్థానిక స్వపరిపాలన

పూర్వపు ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో సమీక్షా కాలంలో 40 మునిసిపాలిటీలు, 11 జిల్లాబోర్డులు, 7000 పంచాయితీలు వున్నవి. ఇవి 1920 సంవత్సరపు మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టం, 1920 సంవత్సరపు మద్రాసు జిల్లాబోర్డుల చట్టం 1950 సంవత్సరపు మద్రాసు గ్రామ పంచాయితీల చట్టముల ప్రకారం పని చేస్తున్నవి ఇదే కాలంలో తెలంగాణాలో 9 జిల్లా బోర్డులు, 16 సిటీ మునిసిపాలిటీలు, 1,187 గ్రామపంచాయితీలు వున్నవి. ఇవిగాక హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలకు రెండు మునిసిపల్ కార్పొరేషను లున్నవి.

## ప్రజారోగ్యం

ఆంధ్రప్రాంతంలో గల 28 సామాజికాభివృద్ధి బ్లాకులలో ఒక్కొక్కదానిలోను, తెలంగాణాలో గల 12 బ్లాకులలో ఒక్కొక్క దానిలోను ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం పనిచేస్తున్నది. దానిక్రింద మూడు ఉపకేంద్రాలు వున్నవి. ఇందులో ఒక మెడికల్ ఆఫీసర్, హెల్తు ఇనస్పెక్టర్, హెల్తు విజిటర్, నలుగురు మెటర్నిటీ అసిస్టెంట్లు, సహాయక సిబ్బంది వుంటారు. ఈ కేంద్రాలు గ్రామీణ ప్రజలకు వైద్య సేవచేస్తూ వుంటాయి. ఆంధ్ర ప్రాంతంలోని 31 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో ఒక్కొక్క దానిలో మామూలు వైద్య బృందం పనిచేస్తూ వుంది. తెలంగాణాలోగల 16 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో ఒక్కొక్కదానిలో ఒక హెల్తు ఇనస్పెక్టర్ ప్రజారోగ్య విధులను నిర్వహిస్తూ వుంటాడు.

రెండవ పంచవర్ష ప్రణాళిక అమలు సందర్భంలో, ప్రసూతి, శిశు సంక్షేమ కార్యక్రమాలకు ప్రాధాన్యం వుంది. సమీక్షా కాలంలో తెలంగాణా ప్రాంతంలో 68 ప్రధాన ప్రసూతి శిశు ఆరోగ్య కేంద్రాలు, 52 ఉపకేంద్రాలు పనిచేస్తూ వున్నవి. ఆంధ్రప్రాంతంలో 408 ప్రసూతి శిశు ఆరోగ్య కేంద్రాలు, 42 ఉపకేంద్రాలు ఉన్నవి.

పాఠశాలల ఆరోగ్య సేవల ననుసరించి సమీక్షా కాలంలో తెలంగాణా ప్రాంతంలో దాదాపు 60,000 మంది బాలురను, 20,000 మంది బాలికలను స్కూళ్ళ మెడికల్ ఇనస్పెక్టర్లు పరీక్ష చేశారు. ఆంధ్ర ప్రాంతంలో పనిచేస్తున్న ప్రాంతీయ ఆహార పరిశోధన సంస్థ యథాప్రకారం విశాఖ పట్నంలోనే పనిచేస్తూ ఆహార పరిశీలనలు, బెరిబెరి లక్షణాల పరిశీలనలు జరిపింది. 1956 సంవత్సరాంతంలో ఈ సంస్థ గుంటూరుకు మార్చబడింది. తెలంగాణాలో మూడు జట్లతో బి.సి.జి. టీకాల కార్యక్రమం దాదాపు పూర్తి కావస్తున్నది. ఆంధ్ర ప్రాంతంలో టీకాలు వేయబడుతున్నవి. అక్కడ ఈ ఉద్యమాన్ని పెంపొందించే ఉద్దేశంతో ఒక తెలంగాణా జట్టును త్వరలో ఆంధ్ర ప్రాంతానికి తరలించాలని తలపెట్టబడింది. సమీక్షా కాలంలో తెలంగాణాలో 17 కుటుంబ నియంత్రణ కేంద్రాలు, ఒక కుటుంబ సంక్షేమ కేంద్రం, ఆంధ్ర ప్రాంతంలో కర్నూలులో ఒక కేంద్రం పనిచేస్తున్నవి.

## మలేరియా నివారణ కార్యక్రమం

జాతీయ మలేరియా నివారణ కార్యక్రమంక్రింద ఆంధ్ర రాష్ట్రంలో 34 మలేరియా నిరోధక పథకాలపై పని జరుగుతూవున్నది. వాటిలో 4 పథకాలు ఏజన్సీ ప్రాంతాలలోని కొండజాతుల శ్రేయస్సు నిమిత్తమై కేటాయింపబడ్డవి. సమీక్షా కాలంలో తెలంగాణా ప్రాంతంలో మూడు మలేరియా నిరోధక యూనిట్లు విజయవంతంగా పని చేస్తూ వున్నవి.

బోదకాలు వ్యాధి నివారణ యూనిటు ఆంధ్రలో 58 గ్రామాలలో మందుచల్లే పనినీ, 95 గ్రామాలలో ప్రజలకు చికిత్సచేసేపనినీ నిర్వర్తించింది. సమీక్షా కాలంలో తెలంగాణాలో కరీంనగర్ జిల్లాలోని మానేరుగ్రామంలో ఇళ్ళల్లో మందు చల్లబడింది.

యాస్ నివారణ పథకంక్రింద తెలంగాణాలో వివిధ తాలూకాలలో 4 జట్టులు పనిచేసినవి. 29,200 మంది ప్రజలు పరీక్షించబడ్డారు. వారిలో

1,150 మందికి చికిత్స చేయబడింది. ఆంధ్ర ప్రాంతంలో 2 ఫీల్డుటీములు ఇంచుమించు 1,20,600 మందిని పరీక్షించాయి. 3,034 మందికి చికిత్స చేయబడింది.

### వెనుకబడిన తరగతులు

రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలలో చేరడంలో వెనుకబడిన తరగతులకు, షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులకు తోడ్పడ్డానికై ఆ కులాలకు చెందిన అభ్యర్థుల గరిష్ఠవయః పరిమితి 5 సంవత్సరాలు హెచ్చింప బడింది.

### కొండజాతుల సంక్షేమం

1950 సంవత్సరపు షెడ్యూల్డు జాతుల ఉత్తర్వులో ప్రకటింపబడిన ప్రకారం ఆంధ్ర ప్రాంతంలో ఇంచుమించు 23 ప్రధానమైన జాతులున్నాయి. సమీక్షా కాలంలో ఆంధ్ర ప్రాంతంలో కొండజాతులకు కొత్తగా 2 ప్రభుత్వ వసతిగృహాలు-విశాఖపట్నం జిల్లా పాడేరులో ఒకటి, తూర్పు గోదావరి జిల్లా పుల్లంగిలో ఒకటి-ప్రారంభింపబడినవి. చింతపల్లి, కూనవరాలలో ఉన్న గవర్నమెంటు సబ్సిడైజుడు హాస్టళ్ళల్లో చేర్చుకొనేవారిసంఖ్య హెచ్చించ బడింది. కొండజాతి పురుషులకు శిక్షణ ఇవ్వబడింది. దోర్నాలలో చెంచులకు పాఠశాలా వసతిగృహం తెరువబడింది. కొండజాతి ప్రజలు నివసించే ప్రాంతాలలో రాకపోకల సౌకర్యాలు హెచ్చించ బడినవి.

కొండజాతి ప్రజలకు పరపతి సౌకర్యాలను కలిగించడానికై స్థాపించబడిన ఆంధ్ర షెడ్యూల్డు జాతుల సహకార ఆర్థిక, అభివృద్ధి కార్పొరేషన్ 1957-58 నుంచి పని ప్రారంభించింది. దీనికి ద్వితీయ ప్రణాళికలో రూ. 9.50 లక్షలు కేటాయించ బడినవి. దీని ముఖ్యకార్యాలయం విశాఖపట్నంలో ఉంది.

తెలంగాణా ప్రాంతంలో షెడ్యూల్డుజాతుల జనసంఖ్య ఇంచుమించు 3 లక్షలు. 1956-57 లో కొండజాతి ప్రజల విద్య, వ్యవసాయం, కుటీరపరిశ్రమలు, రోడ్లు, ప్రజారోగ్యం, కాలనీల అభివృద్ధి పథకాలకై రూ 2,63,750-లు కావాలని అంచనా వేయబడింది. 31-3-1957 తేదీవరకు రూ. 1,63,195 లు ఖర్చు పెట్టబడినవి.

### గృహనిర్మాణ కార్యక్రమం

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత రాష్ట్రంలోని భవన నిర్మాణపు పనులన్నీ చీఫ్ ఇంజనీరు (భవనాలు) ఆధీనంలో ఉంచబడినవి. ఆయనక్రింద ఆంధ్ర ప్రాంతంలో ఒక కన్సల్టింగు ఆర్కిటెక్టు, తెలంగాణా ప్రాంతంలో ఒక స్టేట్ ఆర్కిటెక్టు పని చేస్తున్నారు. 1956-57 లో, రూ. 67.28 లక్షల అంచనా ఖర్చుపై జరుగవలసిన దిగువ సంస్థల నిర్మాణపు పనులు తగినంతగా పురోగమించినవి. విశాఖపట్నం కె. జి. హాస్పిటల్, అమలాపురం హెడ్ క్వార్టర్సు హాస్పిటల్, గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి, కర్నూలు ప్రభుత్వ జనరల్ హాస్పిటల్; గుంటూరు. కర్నూలు ప్రభుత్వ వైద్య కళాశాలలు, అవంతపురం, కాకినాడ ఇంజనీరింగ్ కళాశాలలు.

తెలంగాణా ప్రాంతంలో, రాజధాని కర్నూలు నుంచి హైదరాబాదుకు తరలించబడిన కారణంగా రాష్ట్ర ప్రభుత్వం హైదరాబాదులో ఉద్యోగుల గృహనిర్మాణాన్ని చేపట్టింది. జూనియర్ ఆఫీసర్లకు 100 నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు 1,000 గృహాలు నిర్మించబడతాయి. వీటి అంచనాఖర్చు వరుసగా రూ. 17.8 లక్షలు, రూ. 83 లక్షలు. ఇవికాక హైదరాబాదులోని సెక్రటేరియెట్ భవనాలు, శాసన సభాభవనం, హైకోర్టు భవనాల అభివృద్ధికై రాష్ట్ర ప్రభుత్వం రూ. 8.23 లక్షలు వ్యయపరచింది.



# నాగార్జునసాగర్



మన రాష్ట్రానికి ఆశాజనకమైన బహుళార్థ సాధక పథకం నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం ప్రాథమిక కార్యక్రమాల దశలో చాలావరకు పురోగమించింది. నది వెడల్పులో 3 వ వంతువరకు కాఫర్ డామ్ నిర్మాణము, చాలావరకు నివాస గృహాల నిర్మాణము పూర్తి అయింది. కుడి కాల్వ 52 వ మైలువరకు, ఎడమ కాల్వ 32 వ మైలు వరకు సమగ్రమయిన సాంకేతిక పరిశీలనకూడా పూర్తి అయింది.

బహుళార్థ సాధకమైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు దక్షిణభారతంలోనే మేటిప్రాజెక్టు అని చెప్పవచ్చు. నందికొండ గ్రామంవద్ద కృష్ణానదిపై డాము నిర్మాణం, డాముకు రెండు వైపులా కాలువల నిర్మాణం- ఇవి ఈ ప్రాజెక్టు ముఖ్యకార్యక్రమాలు. దీని కాలువలవల్ల కుడి వైపున గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలకు, ఎడమవైపున నల్లగొండ, ఖమ్మంమెట్టు కృష్ణాజిల్లాలకు సాగునీరు లభిస్తుంది. ఇప్పుడు ఈ ప్రాజెక్టువల్ల సాగునీరు లభించేప్రాంతాలన్నీ కరువుకాటకాలకు గురిఅవుతూ వున్నట్టివి. ప్రాజెక్టుకు 10-12-1955 తేదీన ప్రధానమంత్రి శంకుస్థాపన చేశారు. అప్పటినుంచి ప్రాజెక్టుపని త్వరితగతిని జరుగుతూ వున్నది.



*యూనియన్ ప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ యస్. కె. పాటిల్ నాగార్జున సాగర్ రాతికట్టుకు శంకుస్థాపన చేశారు.*



*మాచెర్లనుంచి నాగార్జునసాగర్ డాము స్థలానికి వేయబడుతున్న రైలుమార్గం.*

నాగార్జునసాగర్ బహుళార్థ సాధక ప్రాజెక్టు దక్షిణాపథంలోని ప్రాజెక్టు లన్నిటికంటె పెద్దది. ఈప్రాజెక్టుక్రింద నందికొండవద్ద కృష్ణానదికి ఆనకట్ట కట్టబడి, రెండు వైపుల కాల్వలద్వారా సాగునీటి సప్లయి జరుగుతుంది. కుడి కాల్వక్రింద గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలోనూ, ఎడమ కాల్వక్రింద కృష్ణా, నల్లగొండ, ఖమ్మంమెట్టు జిల్లాలలోనూ, బహుకాలంగా క్షామరాక్షసి వాతబడుతున్న విశాలమయిన భూభాగాలు సారవంతము కాగలవు. 1955 డిశెంబరు 10 వ తేదీన భారత ప్రధానమంత్రి యీ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేసిననాటినుండి, ప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమం చురుగ్గా కొనసాగుతున్నది.

మొదటినుండికూడా జాగ్రత్తగా ఒక ప్లాను ప్రకారం పని కొనసాగుతూ ఉండటం ముఖ్యమైన విశేషం. దీనివల్ల పనులు నిర్విఘ్నంగా అనుకున్న విధంగా కొనసాగటమే కాకుండా, నిర్మాణ వ్యవస్థ, అజ్మాయిషీ, అభివృద్ధి మొదలగు విషయాలకు సంబంధించిన అనేక సమస్యలు పరిశీలింపబడి, దుబారాలేకుండా, సర్వసమర్థంగా అన్ని పనులు చేసుకోటానికీ, అన్ని రంగాలలో అప్రతిహతంగా పురోగమించటానికీ అవకాశం కలిగింది. పనులు నిర్వహించటానికి సమర్థవంతమైన నిర్మాణ వ్యవస్థ రూపొందించబడింది. నిర్మాణాలకు సంబంధించిన కార్యక్రమాల నిర్వహణ, నిర్మాణం వివిధదశలలో అవసరమయ్యే కార్మికులు, వివిధ వస్తు యంత్ర సంపద, నివాస వసతులు, కార్మికుల సౌకర్యాలు వగైరా అనేక విషయాలు శ్రద్ధగా పరిశీలింపబడుతున్నవి.

## ఆయకట్టు అభివృద్ధి

ఆయకట్టును అభివృద్ధిచేసే సమస్యలుకూడా పరిశీలింపబడుతున్నవి. ఇందులో ప్రధానమయిన లక్ష్యం ఆనకట్ట, కాల్వల నిర్మాణపు వివిధ దశలకు అనుగుణమయిన విధముగా ఆయకట్టు అభివృద్ధి పరచుకోవటం. అంటే సాగుకు నీరు లభ్యమైనప్పుడు, ఆ నీటిని పూర్తిగా భూములకు వాడుకోటానికి అవసరమయిన విధంగా సిద్ధపడి వుండటం.

1955 డిశెంబరు, 1957 మార్చినెలల మధ్యకాలంలో ప్రారంభ ప్రయత్నాల దశకు సంబంధించిన వ్యవహారాలన్నీ పూర్తి అయినవి. అంతేకాక ఆనకట్ట కాల్వల విషయంలోకూడా నిర్మాణ దశకు అంకురార్పణ జరిగింది.



*నాగార్జునసాగర్ డాము సమీపాన కృష్ణానదిపై నిర్మింపబడిన రోడ్డువంతెన దృశ్యం.*

## ప్రాజెక్టు విశేషాలు

ఆనకట్ట పొడవు 15,080 అడుగులు, ఇందులో 3900 అడుగులు రాతికట్ట, 11180 అడుగులు మట్టికట్ట. మట్టికట్ట ఎడమవైపున 7960 అడుగులు, కుడివైపున 3220 అడుగులు వ్యాపించి వుంటుంది. ఈ ప్రాజెక్టుకు సంబంధించిన దిగువ విశేషాలు పేర్కొనదగినవి.

రాతికట్ట ఎత్తు 367 అడుగులు. ఇక్కడ యేర్పడే రిజర్వాయరు 110 చ. మైళ్ళ ప్రాంతములో నీటిని నిలువ చేస్తుంది. ఈ ప్రాజెక్టు క్రింద క్రొత్తగా 20.6 లక్షల యకరాల భూమి సాగులోకి వస్తుంది.

కుడివైపు కాల్వ పొడవు 135 మైళ్ళు. దీని ద్వారా 11,000 క్యూసెక్కుల నీరు సప్లయి అవుతుంది. ఎడమవైపు కాల్వ 108 మైళ్ళ పొడవు. దాని ద్వారా 8,000 క్యూసెక్కుల నీరు సప్లయి జరుగుతుంది. కుడికాల్వద్వారా గుంటూరు జిల్లాలోని పల్నాడు, సత్తెనపల్లి, వినుకొండ, గుంటూరు, బాపట్ల, ఒంగోలు తాలూకాలకూ, కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాకు ప్రయోజనం కలుగుతుంది. ఎడం కాల్వ వల్ల నల్లగొండ జిల్లాలోని మిరియాలగూడెం, హుజూరునగర్ తాలూకాలకూ, ఖమ్మంజిల్లాలో ఖమ్మంతాలూకాకూ, కృష్ణాజిల్లా నందిగామ తాలూకాకూ ప్రయోజనం కలుగుతుంది.

ప్రాజెక్టు ఖర్చు రూ. 86. 57 కోట్లు అని అంచనా. ఇందులో ఆనకట్టకు రు.33.84 కోట్లు, కుడికాల్వకు రు.29.33 కోట్లు, ఎడం కాల్వకు రు. 23.40 కోట్లు ఖర్చు జరుగుతుంది. ఆనకట్ట 1963 నాటికి, కాల్వల నిర్మాణం 1964 నాటికి పూర్తి కావాలనే లక్ష్యంతో కార్యక్రమం రూపొందించబడింది.

*నాగార్జునసాగర్ డాము స్థలందృశ్యం. కృష్ణానదికి వరద వచ్చినట్లు చిత్రాన్నిబట్టి తెలుస్తున్నది.*

## కార్యక్రమాల నిర్వహణ :

1955 లో ప్రాజెక్టుకు శంకుస్థాపన జరిగిన అనంతరం, తాత్కాలికంగా గుడిశెలు, రోడ్లు, నదిమలుపులు, నీరు, విద్యుచ్ఛక్తి సప్లయి, యంత్రపరికరాల కొనుగోలు వగైరా ప్రాథమిక కార్యక్రమాలు ప్రారంభమైనవి. 1956 మేనెల ప్రాంతానికి 40 అడుగులఎత్తుగల కాఫర్‌డామ్ నిర్మాణం పూర్తిఅయింది. యిది 15 లక్షల ఘనపుటడుగుల వైశాల్యముకల రాతికట్టడము. దీనికి అయినఖర్చు రు. 14 లక్షలు, నదిలో మూడవవంతువరకు యీకట్టడం నిర్మించబడింది. ఈకట్టడం యూనిట్ 1 కి రు. 54 నుంచి రు. 62 వరకు ఖర్చు గిట్టుబాటయ్యేవిధంగా నిర్మాణం జరిగింది. యింతకంటే తక్కువరేటు భారతదేశంలో ఎక్కడాలేదు. రాతి అనకట్టప్రాంతంలో, పునాదులత్రవ్వకంపని 1956 జూన్‌లో ప్రారంభమైంది. నదివెడల్పు మొత్తం 3100 అడుగులు. దీనికిగాను 1957 మే వరకు 2100 అడుగులపొడవున పునాదుల త్రవ్వకంపని పూర్తిచేయబడింది. కాఫర్‌డామ్ ప్రాంతంలో 700 అడుగులపొడవున, పునాదుల త్రవ్వకం పూర్తిఅయింది.

నదిమీద రెండువైపుల రాకపోకలకుగాను ఆనకట్టదిగువ భాగంలో 3000 అడుగుల పొడవుగల రోడ్డు వంతెన నిర్మాణం రు. 30 లక్షలఖర్చుతో 1956 ఏప్రియిల్ నెలలో ప్రారంభమైంది. వంతెనవెడల్పు 38 అడుగులు. రెండువరుసలలో రాకపోకలు జరుగవచ్చు. 1957 సెప్టెంబరు నాటికి యీవంతెనపై బండ్లు వగైరా రాకపోకలు ప్రారంభం కావచ్చు. గుంటూరు - మాచెర్ల రైలుమార్గము రు. 40 లక్షల ఖర్చుతో ఆనకట్ట ప్రదేశంవరకు పొడిగింపబడుతున్నది. ఈపని 1956 ఫిబ్రవరిలో ప్రారంభమైనది. 1957 అక్టోబరునాటికి యీమార్గముపై రైలు నడువగలదు.

ప్రస్తుతం యీ నిర్మాణ కార్యక్రమంలో 15 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు. మెకానిక్కులు, పిట్టర్లు మేస్త్రీల తోసహా, మార్కెటింగ్ ప్రాంతాలతో కలుపుకుని ప్రస్తుతం అనకట్ట ప్రాంతపు జనాభా 25 వేలకు పైగావున్నది. రాతి కట్టడపు పనులు ప్రారంభంకావటంతో, కార్మికుల సంఖ్య 25 వేలవరకు పెరుగవచ్చు.

అనకట్టకు 14 మైళ్ళ దూరంలో 2000 కి. వా. శక్తిగల డీసెల్ విద్యుత్కేంద్ర మొకటి మాచర్లలో ఏర్పాటుచేయ బడింది. ఒక హెచ్. టి. విద్యున్మార్గముగుండా నది రెండు వైపులకు యిక్కడనుండి విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడు తున్నది. మాచ్‌ఖండ్‌నుండి జలవిద్యుచ్ఛక్తి సాధించుటకు వీలయిన విద్యున్మార్గ నిర్మాణం పూర్తి అయినది. 1957 మే 31 వ తేదీనుండి మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి సప్లయి జరుగుతున్నది. గుంటూరునుండి అనకట్ట ప్రాంతానికి ట్రంక్ టెలిఫోను, టెలిగ్రాఫ్ మార్గాలు నిర్మించబడినవి. నదికి రెండువైపులనుండి, యిప్పుడున్న రోడ్లతో కలిపే చిన్నరోడ్లునిర్మింపబడినవి. వీటి పొడవు మొత్తం 20మైళ్ళు.

అనకట్టకు బాగా ఒత్తిడిగల భాగాలప్రాంతంలో కాంక్రీటుతో రాతి కట్టడం నిర్మించాలని నిశ్చయించబడింది.

1955-56 సంవత్సరములో అనకట్టమీద అయిన ఖర్చు రు. 75 లక్షలు. 1956-57 లో ఖర్చు రు. 237 లక్షలు. 1957 ఏప్రియల్ నుండి 1957 జూన్ వరకు రు. 80.13 లక్షలు ఖర్చు చేయబడింది.

## పురాతన శిథిలాలు

అనకట్టవద్ద ఏర్పడే రిజర్వాయరు ప్రాంతములో నాగార్జున కొండ శిథిలాలు మునిగిపోయే ప్రమాద మున్నందున. యీ ప్రాంతంలో శిథిలాలకొరకు త్రవ్వకాల కార్యక్రమం పూర్తిచేసి, 1960 మార్చిలో యీ ప్రాంతం మునిగేలోగా, వాటి నన్నిటినీ కొండపైకి చేర్చి, అక్కడ నిలువచేయాలని సంకల్పించబడింది. భారత భూగర్భ శాఖవారు తమ ఖర్చుతో యీ త్రవ్వకాలు నిర్వహిస్తున్నారు. కాని సిబ్బంది నివాస గృహాలు, కొండమీద వస్తుప్రదర్శనశాల నిర్మాణం శిథిలాల పునర్నిర్మాణం వగైరా ఖర్చులన్నీ నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఖర్చుక్రింద భరించుకోవలసి వుంటుంది. ఈ ప్రాంతంలో మొత్తం 2750 యకరాల విస్తీర్ణం నీటిలో మునిగిపోతుంది. ప్రస్తుతం 1200 యకరాల్లో త్రవ్వకాలు జరుగుతున్నవి. అందులో 650 యకరాల్లో పని పూర్తి అయింది.

*కుడికాల్వ* : నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడికాల్వ మూసీ నదీవరకు అంటే 135 వ మైలువరకు నిర్మించబడుతుంది. మొదటి 17 మైళ్ళ ప్రాంతంలో చంద్రవంక అక్విడక్ట్ ప్రధానమైన రాతికట్టడం. దీనికి యితర పనులకు డిజైన్లు పనులు జరుగుచున్నవి. కుడికాల్వ త్రవ్వకాలకు అప్పటి ఆంధ్రరాష్ట్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ది. 11-10-1956 న ప్రారంభోత్సవం చేశారు. ఇప్పటి వరకు ½ మైలునుంచి 17 వ మైలువరకు సుమారు 30,250 యూనిట్ల మట్టి త్రవ్వకంపని జరిగింది.

*ఎడమకాల్వ* : ఏడుమైళ్ళ ప్రాంతంలో కాల్వ త్రవ్వకం పనులు ప్రారంభమై ది. 31-5-1957 వరకు 19898 యూనిట్లు మట్టి పని జరిగింది.

ప్రజలనుండి నిర్మాణాత్మక సహకారము పొందవలసిన అవసరం దృష్ట్యా సుమారు 2 మైళ్ళ పొడవున త్రవ్వకం పని రు 1.5 లక్షల ఖర్చు అంచనాతో భారత్‌సేవక్ సమాజ్‌వారికి అప్పగించటం జరిగింది. ఈ పని మొత్తం 17,700 యూనిట్లు వుంటుందని అంచనా. ఇందులో 4,400 యూనిట్లు అంటే సుమారు 4 వ వంతు పని జరిగింది. మిగిలినపని అంతా 1958 మే నాటికి పూర్తి అవుతుంది.

1957 మార్చి వరకు కుడి. ఎడమ కాల్వలు రెంటిమీద జరిగిన ఖర్చు రు. 163 లక్షలు.

## కంట్రోలు బోర్డు

1955అక్టోబరులో అప్పటిఆంధ్ర. హైదరాబాదు ప్రభుత్వ ప్రతినిధులు, కేంద్రప్రభుత్వ ప్రతినిధులతో కంట్రోలుబోర్డు ఏర్పాటు చేయబడింది. ప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమాలపై యీ బోర్డువారికి పూర్తి అధికారం ఉంది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం 1956 నవంబరులో యీబోర్డు పునర్నిర్మించబడింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అధ్యక్షుడుగానూ, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖ యిరిగేషన్ శాఖల మంత్రులు, కేంద్ర ప్రభుత్వ యిరిగేషన్ విద్యుచ్ఛక్తి శాఖా కార్యదర్శి, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక శాఖ జాయింటు కార్యదర్శి, కేంద్ర జల విద్యుచ్ఛక్తి కమిషన్ అధ్యక్షుడు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుబోర్డు నిర్వహణాధికారి, నాగార్జునసాగర్ అనకట్ట చీఫ్ ఇంజనీరు సభ్యులుగానూ యీపునర్నిర్మాణం జరిగింది. సూపరింటెండింగ్ ఇంజనీరు హోదాగల అధికారి పూర్తికాలం పని చేస్తూ, బోర్డు కార్యదర్శిగా వ్యవహరిస్తాడు. అనకట్ట నిర్మా

ణంమీద యీబోర్డువారికి నేరుగా అధికారం వుంటుంది. కాని కాల్వల నిర్మాణంపై అధికారం రాష్ట్రప్రభుత్వానిది. అయినా యీపనిమీదగూడా బోర్డువారికి అజ్మాయిషీ అధికారాలువున్నవి. ఆనకట్ట నిర్మాణంకొరకు బోర్డువారు ఒక ఆర్థికసలహాదారును నియమించారు. కాల్వల నిర్మాణవిషయంలో యీసలహాదారు చీఫ్అకవుంట్స్ అధికారిగాకూడా వ్యవహరిస్తారు.

బోర్డువారికిగల విధుల నిర్వహణలో యీ క్రిందిస్థాయీ సంఘాలుతోడ్పడుతవి :

1. ప్రాజెక్టు నిర్వహణసంఘం.
2. అగ్రో–ఎకనామికల్ సర్వే సాంకేతిక విషయాల సంఘం.
3. అభివృద్ధి సంఘం.
4. నాగార్జున కొండ త్రవ్వకాల ఉపసంఘం.

కంట్రోలు బోర్డువారి కార్యక్రమం, ప్రాజెక్టుస్థలంలో జరుగుతున్న పనులు అన్నీకూడా ఒక ప్రణాళికప్రకారం జరుగుతున్నవి. ఈప్లాను పరిధిలో వివిధరంగాలలో కృషి కొనసాగింప బడుతున్నది. ప్రాజెక్టుపనులు పొదుపుగా నిర్వహించు కోవటం, త్వరగా పూర్తి చేసుకోవటం, ప్రాజెక్టు ప్రయోజనాలు పూర్తిగా వినియోగించుకోవటం– ఈ ముఖ్యోద్దేశాలతో పనులు జరుగుతున్నవి.

---

## హైదరాబాదులో కొత్త పాలీటెక్నిక్ [30 వ పేజీ తరువాయి]

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రూ. 2½ లక్షలు మంజూరు చేస్తుంది. ప్రజలు రూ. 5 లక్షల విరాళాలు ఇవ్వవలెనని విజ్ఞప్తి చేయబడింది. ఆవృత్తవ్యయాన్ని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ట్రస్టీలు భరిస్తారు.

పాలీటెక్నిక్‌లో ఉన్నత గణితశాస్త్రం ఐచ్ఛిక విషయంగా తీసుకొని మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు మూడేండ్ల సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగు కోర్సులలో శిక్షణ గరప బడుతుంది. ఈ కోర్సులు రాష్ట్ర సాంకేతిక విద్యాబోర్డుచే నిర్వహింప బడుతవి.

పాలీటెక్నికు, దాని ప్రయోగశాలలు, వర్కుషాపులు "ఖుర్షీద్ జాహి బారాదరీ" అనే విశాలమైన భవనంలో నెలకొల్పబడినవి.

---

## ఆంధ్రప్రదేశ్ రైతులు [36వ పేజీతరువాయి]

గుంటకలపై దానినితోలేమనిషినిల్చోనిగానిలేక పెద్ద రాయిపెట్టిగాని బాగా బరువుగా వుండేట్టు చేస్తారు.

జొన్న నూర్పుడుకు కంకుల గుండును ఉపయోగిస్తారు. దీనిని పశువులు లాగుతవి.

మాగాణి భూములలో పచ్చిఆకు ఎరువును తొక్కడానికై కొయ్య గట్టును ఉపయోగిస్తారు. మాగాణి పొలాన్ని దమ్ముచేసి చదును చేయడానికై దేశవాళీ నాగలితో మూడునాలుగుమార్లు దున్నడమేగాక, దేశవాళీ గుంటక, పండ్లమాను కూడా ఉపయోగిస్తారు. ఇప్పుడు వాటికి బదులుగా మరొకరకం పనిముట్టును ఉపయోగిస్తున్నారు.

---

## కర్నూలు వైద్యకళాశాల (40 వ పేజీ తరువాయి)

కోస్తా చివరన విశాఖపట్నంలో వుంది. రెండవ కళాశాల మధ్యప్రాంతమైన గుంటూరులో వుంది. మూడవది రాయలసీమలో కర్నూలులో ఇప్పుడు నెలకొల్ప బడింది. నాల్గవది, అయిదవది—అంటే ఉస్మానియా వైద్యకళాశాల, గాంధీ వైద్యకళాశాల తెలంగాణా ప్రాంతంలో రాష్ట్ర రాజధానీ నగరంలో వున్నవి.

కర్నూలులో కొత్తగా వైద్యకళాశాల ప్రారంభింప బడడం "రాయలసీమలో వైద్య ప్రజారోగ్య సేవల చరిత్రలో ముఖ్యమైన అధ్యాయం. ఎందుచేత నంటే ఈ కళాశాలవల్ల వైద్య వృత్తిని అవలంబించ గోరువారి అవసరం తీరడమేగాక రాయలసీమ వైద్యప్రజారోగ్యావసరాలకు కూడా ఇది ఎంతో ఉపకరిస్తుంది."

# ప్రణాళిక అమలు - ప్రజల బాధ్యత

## వికారాబాదులో హైద్రాబాదు జిల్లా అభివృద్ధి కార్యక్రమాల చర్చాగోష్ఠి

*హైద్రాబాదు జిల్లా అభివృద్ధి కార్యక్రమాల చర్చా గోష్ఠిని ఈ నెలలో రాష్ట్ర ప్లానింగు అభివృద్ధిశాఖల మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రారంభించారు.*

*మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో ప్రజలు పంచవర్ష ప్రణాళికలో కల్పించబడిన వసతులను ఏర్పాటుచేయమని కోరడానికి బదులు, తమ శక్తినంతా పంచవర్షప్రణాళికయొక్క ఉత్పత్తి కార్యక్రమంపై కేంద్రీకరించవలెనని విజ్ఞప్తి చేశారు. అసలు ప్రాథమిక జీవితావసరాలే తీరకుండా వున్నట్టి గ్రామాలలో పురమందిరాలూ, రాకపోకలు, వార్తా సౌకర్యాలూ కావాలని కోరడం సమంజసంకాదని మంత్రిగారన్నారు.*

సమాజాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో ప్రజల సహకారం సాధించవలసిన ఆవశ్యకతను నొక్కిచెబుతూ, స్వాతంత్ర్య భానూదయానంతరం, వ్యక్తి కృషికి బదులుగా సమిష్టి సహకార కృషికి అత్యంతప్రాధాన్యం లభించిందని శ్రీ రాజు అన్నారు. పూర్వపు రోజుల్లో పరిపాలనావ్యవస్థ పైభాగంలో నిజాం నవాబు. క్రిందివైపున గ్రామాధికార్లతో రాష్ట్ర ఆర్థిక వ్యవహారాలు అజమాయిషీ చేయబడుతుండేవి. ప్రస్తుతం నిరంకుశత్వానికి బదులు ప్రజాస్వామ్య వ్యవస్థ యేర్పడింది. ఇంతవరకు గ్రామాలలో పటేలు, పట్వారీలు నిర్వహిస్తున్న కార్యక్రమం ఇకమీద పంచాయితీల పరం కావాలి. ప్రణాళికా నిర్వహణకు అత్యవసరమైన ఉత్సాహ శక్తిని పంచాయితీలు మాత్రమే సమకూర్చగలుగుతాయని మంత్రిగారు అభిప్రాయమిచ్చారు. పంచవర్షప్రణాళిక ప్రజల ప్రణాళిక కాబట్టి దాని నిర్వహణబాధ్యత ప్రజలకే అప్పగించబడాలి. ప్రభుత్వం కేవలం ప్రణాళికా నిర్వహణ విధానాన్ని మాత్రమే నిర్దేశించి అవసరమైన నిధులను కేటాయిస్తుంది. సమధికోత్సాహంతో ముందుకువచ్చి కార్యక్రమాలు నిర్వహించవలసిన బాధ్యత ప్రజలదే. కేవలం ప్రణాళికలోని నిర్దిష్టలక్ష్యాల సాధన మాత్రమే అధికార్లు తమ కర్తవ్యంగా భావించరాదనీ, గ్రామీణప్రాంతాలలో ప్రజానీకంలో చైతన్యం కలిగించి జాతీయపునర్నిర్మాణ నూతన కార్యక్రమాల స్వరూపాన్ని ప్రజలకు వివరించి చెప్పి ఉద్భవించబోతున్న ఆధునిక, సాంఘిక, ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలో వారికి ఆసక్తి కలుగజేయడం అధికార్ల కర్తవ్యమనీ మంత్రిగారు ఉద్బోధించారు.

ఈ ప్రాంతం వెనుకబడిన దగుటచే ప్రజలను అనేక విధాల ఆదుకోవలసిన ఆవశ్యకతను గూర్చి ముచ్చటిస్తూ, హైదరాబాదు జిల్లాలో తాండూరు, పర్గి, వికారాబాదువంటి వెనుకబడిన జాగీర్దారీ ప్రాంతాలు కలవనే విషయాన్ని మంత్రిగారు సభికుల దృష్టికి తెచ్చారు. పోలీసు చర్యకు పూర్వం ఈ జిల్లాలో కనీసం ప్రాథమిక పాఠశాలలు కూడా లేవని తెలిపారు.

హోంశాఖామాత్యులు శ్రీ కె. వి. రంగారెడ్డిగారు ప్రసంగిస్తూ సాగునీటి సౌకర్యాలు, ఎరువుల సప్లయి, మేలురకం విత్తనాల పంపిణీ, పశుసంరక్షణ, పంటల తెగుళ్ళ నివారణ మొదలగు హైద్రాబాదుజిల్లా రైతుల అవసరాలను గూర్చి ప్రస్తావించారు.

వివిధ విషయాలనుగూర్చి చర్చించేందుకై సమావేశం 8 ప్రత్యేక విభాగాలుగా చేయబడింది. అంతకుముందు ప్లానింగు, అభివృద్ధిశాఖామాత్యులు స్థానిక మాధ్యమిక పాఠశాల ఆవరణలో గోష్ఠి సందర్భంగా ఏర్పాటు చేయబడిన ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రదర్శనలో వ్యవసాయ, ఆరోగ్య, వాణిజ్య, పరిశ్రమ, పశుసంక్షేమ, స్థానిక పరిపాలన, అటవీ, సహకార,

కమ్యూనిటీ ప్రాజక్టుల శాఖలకు చెందిన వస్తువులు ప్రద ర్శించబడినవి.

సాయంత్రం జానపదగీతాలు, నృత్యం మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడినవి. ఆ రాత్రి సమాచార పౌరసంబంధములశాఖ, వ్యవసాయ, ఆరోగ్యశాఖలకు చెందిన ఫిల్ముప్రదర్శనలు జరిగినవి. మరునాడు ఉదయం అడిషనల్ డెవలప్మెంట్ కమీషనర్, ప్లానింగు, అభివృద్ధి శాఖల కార్యదర్శి అయిన శ్రీ సి. నర సింహం, ఐ. ఏ. ఎస్. అధ్యక్షతక్రింద విద్వద్గోష్ఠి విస్తృత సమావేశం జరిగింది. ఈ సందర్భంలో జిల్లాలోని అధి కార్ల ప్రణాళికా నిర్వహణ విషయంలో ప్రవర్తించవలసిన విధానం విషయంలో గోష్ఠిలో పాల్గొన్న అనధికార్లు తమ అభిప్రాయాలను వెల్లడించారు. అధికార, అనధికార ప్రముఖుల అభిప్రాయాలను సమన్వయపరుస్తూ ప్రభుత్వాధి కారులు ప్రణాళికా కార్యక్రమంలో పేర్కొనబడిన సమస్త సౌకర్యాలను కల్పించి ఒక రోజులోనే గ్రామాన్ని స్వర్గ తుల్యంగా చేయగలుగుతారనే భ్రాంతిలో పడవద్దని శ్రీ సి. నరసింహం ప్రజలను హెచ్చరించారు. తాము స్వయంకృషిచేస్తే ప్రభుత్వం సహాయంకూడా లభించి తద్వారా ప్రణాళికా ప్రయోజనాలు తమకు లభించగలవని ప్రజలు గుర్తించవలసినదిగా కోరారు. ప్రభుత్వంవద్దనుండి లభించగల ఆర్థిక సహాయం, ఇతర సహాయాలు తమ ప్రయోజనం కొరకు ప్రజలు పూర్తిగా వుపయోగించుకోడా నికి ప్రయత్నించాలని కోరారు. అంతేకాక, ప్రణాళికతో ప్రజల సహకారం అంటే కేవలం కొంత చందాలు, విరా ళాలు వసూలుచేసి అభివృద్ధి బ్లాకులను ఏర్పాటుచేయమని కోరడం కూడా కాదని శ్రీ నరసింహంగారు అన్నారు. తమ వుపన్యాసాన్ని ముగిస్తూ శ్రీ నరసింహం ప్రజా ప్రతి నిధులకు ఇటువంటి విద్వద్గోష్ఠులలో తమ అభిప్రాయాలను వెల్లడించే హక్కు పూర్తిగా వున్నదనీ, వారి అభిప్రాయా లను పూర్తిగా పరిశీలించి, అవి అభివృద్ధి కార్యక్రమాల విజయానికి తోడ్పడునట్లుగా అధికార్లు వినియోగించుకోవా లనీ సలహా ఇచ్చారు.



# వార్తా చిత్రాలు



భారత రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ గారితో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు



సికింద్రాబాదు రైలుస్టేషనులో రాష్ట్రపతికి ఘనమైన స్వాగత మివ్వబడింది.



బంజారా సేవాసంఘం తాలూకు ప్రతినిధివర్గం 26-7-1957 తేదీన హైదరాబాదులోని
"రాష్ట్రపతి నిలయం"లో రాష్ట్రపతిని సందర్శించింది.



బొలారంలోని ఇ. ఎమ్. ఇ. కేంద్రం వర్కుషాపును రాష్ట్రపతి సందర్శించారు.



రాష్ట్రపతి గౌరవసైనిక వందనం స్వీకరిస్తున్న దృశ్యం.



హిందీభాషా వ్యాప్తికై శ్రీ మోటూరి సత్యనారాయణగారు చేసినసేవకుగాను వారికి సన్మానసంచిక సమర్పించబడింది.
రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ సన్మానసంచికను అందజేస్తున్నారు.



శ్రీ మోటూరి సత్యనారాయణగారికి సన్మాన సంచికను అందజేసి ప్రసంగిస్తున్న రాష్ట్రపతి.



బొలారంలోని 'రాష్ట్రపతి నిలయం'లో రాష్ట్రపతి నగర ప్రముఖులకు విందుచేశారు.



ఆంధ్రప్రదేశ్ పూర్వపు గవర్నరు శ్రీచందూలాల్ ఎమ్. త్రివేదీ రాజభవన్‌లో రాష్ట్రపతికి అల్పాహారవిందు చేశారు.



రాష్ట్రపతితో డా. పట్టాభి సీతారామయ్యగారు, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ సి. యం. త్రివేదీ, తదితరులు.



తమకు వీడ్కోలు చెబుతూ జూబ్లీహాలులో రాష్ట్రప్రభుత్వం చేసినవిందులో శ్రీ సి. యం. త్రివేదీ ప్రసంగిస్తున్నారు.



రాష్ట్ర గవర్నర్‌గా పదవీ విరమణ చేసిన శ్రీ సి. యం. త్రివేదీకి ముఖ్యమంత్రి వీడ్కోలు విందు చేశారు.
విందు సందర్భంలో శ్రీ త్రివేదీ రాష్ట్ర మంత్రులతో ముచ్చటిస్తున్న దృశ్యం.



ముఖ్యమంత్రి, శ్రీ. సి. యం. త్రివేదీకి పూలమాల వేస్తున్నారు.



రాష్ట్రగవర్నరు పదవినుండి విరమించుకొన్న శ్రీ సి. యం. త్రివేదీ సికింద్రాబాదు రైలుస్టేషన్‌లో
తమకు వీడ్కోలు చెప్పవచ్చినవారి వద్దనుంచి సెలవు పుచ్చుకుంటున్నారు.



సికింద్రాబాదు రైలుస్టేషన్‌లో త్రివేదీ దంపతులకు వీడ్కోలు చెబుతున్న కొత్త గవర్నరు శ్రీ భీమసేన్ సాచార్,
శ్రీమతి సాచార్, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీమతి సంజీవరెడ్డి, ఇతర మంత్రులు, శాసన సభాధ్యక్షులు.



స్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవాల సందర్భంలో 16-8-57 న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాంస్కృతిక కార్యక్రమాన్ని యేర్పాటుచేసింది. గవర్నరు శ్రీ భీమసేన్ సచార్, శ్రీమతి సచార్, ముఖ్యమంత్రి ప్రభృతులు ఆ కార్యక్రమాన్ని తిలకిస్తున్న దృశ్యం.



సాంస్కృతిక కార్యక్రమంలో ఒక దృశ్యం.



గవర్నరుగా పదవీ విరమణచేసి హైదరాబాదునుంచి వెళ్ళిపోతున్నసందర్భంలో తీయబడిన చిత్రం.
చిత్రంలో శ్రీ సి. యం. త్రివేది, రాష్ట్రమంత్రులు, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి వున్నారు.